Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102816

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

బాల్కను ప్రాంతములో సంచలనములు

దేశరక్షణలో పాల్గొనుటకు కాంగ్రెసు షరతులు

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ శు॥ ౭ (౫-౧౦-౧౩౪౯ఫ.) గురువారము సంచిక ౨౦

# తుర్కీపై జర్మను ఆరోపణ

## తురీ్క, యుగోస్లావియాలకు ఇటలీ హెచ్చరికలు

## ప్రపంచశాంతికి అమెరికా సూచనలు

జూలై ౪వ తేది నుండి జూలై ౫వ తేదీవరకు వచ్చిన వార్తలలో అన్నిటికంటె ముఖ్యమైనది దక్షిణాఫ్రికా సముద్రతీరమునందు ఓరానువద్ద ఫ్రెంచి యుద్ధనౌకలపై బ్రిటిషు యుద్ధనౌకలు దెబ్బకొట్టుటవలన బ్రిటిషు ప్రభుత్వముయొక్కయు ఫ్రెంచి ప్రభుత్వముయొక్కయు రాజకీయసంబంధములో అతివేగముగా కలుగుచున్న పరిణామమునకు సంబంధించియున్నది. ఈ పరిణామధోరణి ఎట్లున్నదో గమనించుటకు పూర్వము బ్రిటిషువారిచే ఓరాను సంఘటనతర్వాత దెబ్బలుతినిన మరికొన్ని ఫ్రెంచినౌకల సంగతిని తెలిసికొనుదము.

### ఫ్రెంచినౌకలపై మరికొన్ని దెబ్బలు

జూలై ౩వ తేదినాడు ఓరానువద్ద ఫ్రెంచినౌకలపై బ్రిటిషువారు వేసినదెబ్బవలన డన్కర్కు అనుపేరుగల ఫ్రెంచివారి యుద్ధపు క్రూయిజరు రకపుఓడ చెడినందున దానిని గట్టుకుచేర్చియుండిరికదా! ఆదేఓడపై జూలై ౬వ తేది ఉదయము బ్రిటిషువారి నౌకాదళమునకు చెందిన విమానములనుండి ఆరుదెబ్బలు వేయబడెను. బ్రిటిషువారి విమానములు రెండు తిరిగి స్వస్థానము చేరుకొనలేదు. ఫ్రెంచివారి వర్తకపుఓడలవెంట తోడుగాపోవు సాయుధనౌకయగు రిగాల్డు డీజినోయిల్లీఅను ఓడపై అల్జీర్సుకుబయట ఎవరి జలాంతర్గామినుండియో టార్పెడో ప్రయోగించబడుటచే అది పాడయ్యెను. తర్వాత జూలై ౭వ తేది "రిచలో" అను క్రొత్తగానిర్మితమైన ఫ్రెంచిఓడ బ్రిటిషునౌకాదళముచే పాడుచేయబడెను.

ఉత్తరఫ్రాన్సులో నిర్మించబడుచుండిన ఫ్రెంచిఓడలు కొన్ని సమర్థులైన పనివారలతో గ్రేటు బ్రిటనుకు జూలై ౩వ తేదిలోగా చేర్చబడినవి. అలెగ్జాండ్రియారేవులో ఫ్రెంచిఓడలు ఎక్కడికిని కదలకుండ చేయబడినట్లు బ్రిటిషువారు ప్రకటించినారు.

ఓరానులో దెబ్బతినియుండిన స్ట్రాస్‌బోర్గు అను ఫ్రెంచియుద్ధనౌక అనేకములైన టార్పెడో పడవలతోను, మరికొన్ని చిన్నపడవలతోను టూలోనుకు జూలై ౪వ తేది చేరెను.

### పరిణామము

ఈవిధముగా ఫ్రెంచిప్రభుత్వమువారి ఓడలను బ్రిటిషుప్రభుత్వ నౌకాదళము చెడగొట్టుచుండుటవలన ఫ్రెంచిప్రజల హృదయములలోను, ఇపుడు ఫ్రెంచిప్రభుత్వమునందున్నవారల హృదయములలోను ఎట్టిపరిణామముకలిగినదో నిష్కర్షగా చెప్పజాలము. ఎందుకనగా ఫ్రాన్సుదేశమిపుడు జర్మనీప్రభుత్వమునకు లొంగినసంగతి అందరికిని తెలిసినదే. జర్మనీప్రభుత్వమువారు ఫ్రెంచివారి ఓడలను తామువయోగించుకొనవలెననియో లేక కేవలము బ్రిటిషువారికిగాని జర్మనీపై ప్రతిఘటించినపుడు ఫ్రెంచివారికిగాని ఉపయోగపడకూడదనియో ఫ్రెంచినౌకలేచటనున్నను, వాటినన్నిటిని ఫ్రాన్సురేవులలో చేర్చి నిరాయుధములనుగ చేయవలెనని కోరియుండిరి. అట్టి ఓడలను బ్రిటిషువారు ఫ్రాన్సురేవులకు చేరకుండచేయుట జర్మనుప్రభుత్వమువారికి సమ్మతమగునని ఎవరును అనుకొనరు. అందువలన ఆ బ్రిటిషు చర్యను ఫ్రెంచిప్రభుత్వమువారుగాని, ఫ్రెంచిప్రజలుగాని హర్షించుటకూడ జర్మనులకు సమ్మతముకాజాలదు. అందుచే జర్మనుప్రభుత్వమువారు ఫ్రెంచిప్రభుత్వమువారిని బ్రిటనుచర్యను హర్షించనీయరు. ఫ్రెంచిప్రజలు హర్షించునట్లున్నను ఫ్రెంచిప్రభుత్వమువారిని ఒత్తిడిచేసి ఫ్రెంచిప్రజల హర్షముకూడ ప్రకటితముకాకుండ అణచబడునట్లు జర్మనుప్రభుత్వము జాగ్రత్తపడకొనక లదు. అందువలన ఇపుడు పెటెయిన్‌గారి అధ్యక్షతన అధికారములోనున్న ఫ్రెంచిప్రభుత్వము బ్రిటిషుచర్యయెడ తమ ఆగ్రహమును బ్రిటను ప్రధాననగరమగు లండనులోనుండు ఫ్రెంచిరాయబారిద్వారా పత్రములో బ్రిటిషుప్రభుత్వమునకు తెలియజేసిరనినపుడు, ఈ ఆగ్రహము నిజముగా ఫ్రెంచివారి ఆగ్రహమో లేక జర్మనీవారి ఆగ్రహమో నిర్ధారణచేయుట కష్టమేయగును.

ఆయినను, యుద్ధవిరామమునకు పూర్వము ఫ్రాన్సుయొక్క యుద్ధమంత్రివర్గమందుండి ఇపుడు చీలిపోయిన ఫ్రాన్సు జర్మనీపై యుద్ధమే సాగించుచుండవలెననుచున్న జనరల్ డీగాల్‌గారు జూలై ౬వ తేదినాడు లండనునుండి బ్రాడ్‌కాస్టు చేసిన ప్రకటనలో బ్రిటిషువారిచే సముద్రములో ఫ్రెంచిఓడలు ముంచబడెనని వినగానే విషాదమును, ఆగ్రహమునుపొందని ఫ్రెంచిజాతీయుడెవడును లేడని చెప్పియుండుటచూడగా, ఫ్రెంచప్రజల హృదయములపై ఓరానులో బ్రిటిషుఓడల చర్యయొక్క ఫలితము విషాదాగ్రహములని నమ్మవచ్చును ఇంతమాత్రముచేత ఫ్రెంచిఓడలు బ్రిటిషువారిపై వైరము బూనరాదనుచు డీగాలుగారు అంతమున బ్రిటిషువారికి జయముకలుగుచో, ఫ్రెంచివారు పోగొట్టుకొనిన స్వాతంత్ర్యము తిరిగివారికి లభించును కాబట్టి ఫ్రెంచిఓడలు జర్మనీకి ఉపయోగపడకుండునట్లు వాటిని పాడుచేయుటయే మంచిదనినారు. జర్మనీప్రభుత్వమువారుకూడ ఫ్రెంచి ఓడలు బ్రిటిషువారికి లొంగవలసిన స్థితివచ్చుచో లొంగుటకన్న ఆత్మవిఘాతము గావించుకొనుట మంచిదనుఆజ్ఞను ఫ్రెంచిప్రభుత్వము వారిచే యిప్పించినారు.

ఇంతకును చెప్పదలచినదేమనగా ఓరానుసంఘటనముచే ఫ్రెంచిప్రజలలో కలుగగల భావములను ఆధారముచేసికొని జర్మనీ స్వలాభమును సాధించుటకు అనేకయుక్తులను పన్నుచున్నట్లు కనిపెంచుచున్నది. జర్మనీకిని ఫ్రాన్సుకును జరిగిన యుద్ధవిరామసంధిలో ఓకషరతు ఫ్రెంచిఓడలను ఫ్రాన్సురేవులకురప్పించి నిరాయుధములనుగ జేయవలెననిగదా, ఇపుడు జర్మనీవారు ఫ్రెంచిఓడలు తమనెదుర్కొను బ్రిటిషుఓడలతో యుద్ధముచేయుచో వాటికుపయోగించుటకై ఆయుధములను ఉంచుకొనుట క్షేమకరమని ఫ్రెంచిప్రభుత్వమువారికి తెలియజేసినారు. ఫ్రెంచిప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వముతో రాజకీయసంబంధము వదలుకొనుటయు జర్మనీ ప్రేరణయే అయియుండవచ్చును. జూలై ౫వ తేదినాటికి లండనులో ఫ్రెంచిరాయబారి బ్రిటిషు ప్రభుత్వ విదేశాంగశాఖవారికి లండనునుండి ఫ్రెంచిరాయబారి కార్యాలయము ఫ్రాన్సుకు వాపసుచేయబడినట్లు తెలిపిరి, ఇదియిట్లుండగా ఫ్రాన్సు, జర్మని, ఇటలీకలిసి ఏదోఒక క్రొత్త ఒడంబడికను రహస్యముగా చేసికొనినట్లు వినుచున్నాము. బహుశా ఈ ఒడంబడికయొక్క ఉద్దేశ్యము బ్రిటనుపై ఫ్రాన్సు యుద్ధము చేయునట్లు చేయుటయేమో. ఇట్టి అనుమానములకు తగినట్లే పెటెయినుగారి ప్రభుత్వము బ్రిటిషు యుద్ధనౌకలను, విమానములను ఫ్రాన్సు సముద్రతీరమునుండి ౨౦ మైళ్లదూరమునకులోగా ప్రవేశించుచో వాటిపై దెబ్బవేయుడునను ఆజ్ఞను ప్రకటించినారు. ఇపుడు ఫ్రెంచివారి సేనను నిరాయుధము చేయుటలోకూడ ఆలస్యము జరుగవచ్చునని వినవచ్చిన వార్తకూడ అనుమానమునే బలపరచునదిగాయున్నది. ఆ సేనను నిరాయుధముచేయక బ్రిటనుపైకి పంపవలెనని తలంపుఅయియుండవచ్చును.

### డీగాల్ గారిపని

ఈలోగా జనరల్ ఫ్రెంచిప్రజలు మాత్రము జర్మనీపై ఇంకను యుద్ధముసాగించుచునేయుండవలెనని ప్రచారముచేయుచున్న జనరల్ డీగాల్‌గారు బ్రిటిషువారితోకలిసి పోరాటము సాగించుటకై ఫ్రెంచివాలంటీర్లను చేర్పించుచునేయున్నారు. అట్లుచేర్పుకొను కార్యాలయములు ఒలింపియాలో స్థాపించబడినవి

### ఫ్రెంచివారి సామంతరాజ్యాలు

సిరియాఅనునది ఫ్రెంచివారి సామంతరాజ్యము డీగాల్‌గారి ప్రచారముచే ఆకర్షించబడి సిరియాలోని ఫ్రెంచిసేనల అధిపతితాను తనసేనలతో బ్రిటిషుపక్షమున పోరాడెదనని ప్రకటించిరి. వెంటనే పెటెయినుగారి ప్రభుత్వమందు ఒక మంత్రిగానున్న జనరల్ వేగాండుగారు ఆతనిని లొంగదీసినవెంటనే, అతడు సిరియాలో వైరములు చాలించబడినవని ప్రకటించిరి. అంతమపై బ్రిటిషు ప్రభుత్వాధికారానుమతితో చేయబడిన ఒకప్రకటనయందు సిరియాప్రక్కనున్న బ్రిటిషువారిప్రదేశములపైకి దూకుటకు జర్మనీగాని ఇటలీగాని సిరియాను ఉపయోగించునపుడు సిరియాలో సేన ఆటంకపరచనిచో, బ్రిటిషువారు ఊరకుండజాలరని హెచ్చరిక చేయబడెను. ఇపుడు సిరియాలో శాంతముగానేయున్నది. బ్రిటిషు సైనికరాయబారుల నాయకుడు తనపని ముగిసినదనితలంచి సిరియావదలి పోయినాడు.

సిరియాపై దృష్టి చాలా పట్టింపుగానున్నది. ఇంగ్లాండు రాజ్య విదేశాంగ తుర్కీ ప్రభుత్వప్రతినిధితోకలసి సంభాషించినతర్వాత సిరియా స్వతంత్రరాజ్యము కావలెనని అందరును ఒకేమాటగా అంగీకరించినట్లు వార్తవచ్చినది. ఈలోగా ఇరాకులోని మోసుల్‌లో పెట్రోలు బావులనుండి పెట్రోలు సిరియాకు పంపకుండా చేసి మూసుకొనవలసినది.

### వెస్టిండీస్ దీవులు

వెస్టిండీస్ దీవులలో మార్టినిక్ అను దీవిలో అధికారులు పెటెయినుగారి ప్రభుత్వమునకు బద్ధులనియు, ఈదీవివద్ద బిడిస్ట్రా యనునది జలాంతర్గాములను ఉన్నట్లును, మరియు అమెరికాను ఫ్రెంచివారుకొనిన విమానములుకూడ ఇచ్చటనేయున్నట్లును, వీటిని అన్నిటిని పట్టుకొనుటకై బ్రిటిషువారు అదివరకే ముట్టడివేసియున్నట్లును ఈదీవి అమెరికావారు తమకుచెందిన సముద్రతీరమునుండి ఇన్ని మైళ్లలోగా యుద్ధచర్యలు

(౧౦వ పేజీ చూడుడు)



# మౌలానా అబుల్ కలాం ఆజాద్

"తక్సీం గిర్‌గయి తేజ్‌పిజ్‌మంజూర్"- త్రిపురీకాంగ్రెసు వేదికనుండి మాటిమాటికి ఈమాటవినవచ్చుచుండెను. దక్షిణదేశపు ద్రావిడులకు దీనిఅర్థమే తెలియుటకు వీలులేదు. ఔత్తరాహులలో ఉర్దు సంపర్కములేని శుద్ధహిందీజనులకుకూడ అంతే.సవరణపడిపోయినది. తీర్మానము నెగ్గినదియని దీనియర్థము. త్రిపురిలో తర్మీములగొప్పసమారాధన కాంగ్రెసు మగియుండ తలో ప్రతినిధులకీవాక్యము కంఠస్థము. ఈ ఉత్సాహవినోదముల సందడిలో తీర్మానముల యదృష్టశ్రవణమెుక్కసారియైననూ ఇంగ్లీషులో రాలేదని జనులకు తోచనేలేదు.

త్రిపురిలో మౌలానా ఆజాదుగారే అధ్యక్షకార్యమును నిర్వహించిరి. మాజీ అధ్యక్షపరంపరలో అక్కడనుండినవారిలో వీరిదే యగ్రతాంబూలము. గనుక ఆకార్యము వీరిపాలిటికి వచ్చెను. తీర్మానములను, సవరణలను ప్రతినిధులముందిడి ఫలములజెప్పుట వీరిపని. వీరికి ఆంగ్లభాషాపరిచయము తక్కువయని అందరకు తెలిసినదప్పుడె. అయినను ఆజాదుగారు నేను రాష్ట్రపతి. మెకాలెదొరగారి "గులాంగిరి"విద్యకు హిందూస్థానము చూపెట్టుగౌరవమునకిదిగురుతు.

హిందూముస్లిములు ఒకజనాంగముకాదు. ఇద్దరిది వేర్వేరుసృష్టి. తూర్పుపడమరల భేదమది. కరగింపజాలనిభేదము. మరవజాలని భిన్నత అని జిన్నాగారు వాదించుచున్నారు. ఈ వాదము నేటిదికాదు. అలీఘుర్ ఉద్యమము దీనియాకారము. ఈవాదము భ్రాంతిజన్యము.ఆత్మవిఘాతకమని ఆజాదుగారు మొదటినుండియు చెప్పుచున్నారు. వీరికృషివేతనే దేశమునందీదృష్టి వ్యాపించుచున్నది. అవిశాలదృష్టి ఐక్యసాధనములకే వీరికేవితమర్పితము. ఇదివరకు మరుగువనున్న విషభావన జిన్నాసాహేబుగారి పుణ్యమువలన పైకివచ్చినది. భేతాళునిభంగినాట్యముచేయుచున్నది. ఇట్టిసందర్భమున మనమందరమెుకటి, ఒకేవృక్షపు రెండుశాఖలని ముప్పదిసంవత్సరములనుండి ఏకఘోషగా చాటుచుండిన ఆజాదుగారు రాష్ట్రపతియగుట అవాదము.నకు భరతవాక్యముకదా. జనులు వీరికీపదవి కెన్నుకొనలేదు. ఆపీఠమువీరికై సదా సిద్ధముగ నేయుండినది. ఆజాదుగారే స్వయముగ ఆకార్యవిధికి ముందునిలిచి పౌరోహిత్యమువహించిరి.

ఆజాదుగారి రాష్ట్రపతిత్వమునకిదే ప్రథమముకాదు. పదునేడు సంవత్సరముల క్రిందటనే వీరీగౌరవము చెందియుండెను, అప్పుడుకూడ ఇట్టిసందర్భమే. కాంగ్రెసుకు. దేశమునకు ఇప్పటిరలె విషమపరీక్ష. ఇప్పుడు పరయూథకలహము నోరుతెరచి కాచుకొన్నపులివలె ఎదుట కూర్చొనియున్నది. పులివన్నెకు భయపడుచున్న ఈ దేశమునకు దాని గోటిగాయపు పరిచయమువాత్రము మెరసు. మనమునూరురకాదు నూట అయిమువరసు భావన వ్యాపింపవచ్చును. ౧౯౨౩ లో కాంగ్రెసు స్వయూథకలహపు యాదవకేళిలో మునిగియుండెను. ఇపుడు సింహకిశోరమెుకరాట లాడుచుండినప్పుడు బంగాలపు సింగమె చెలరేగియుండెను.

౧౯౨౩ లో కాంగ్రెసు గయాక్షేత్రమున జరిగెను. అప్పుడు కాంగ్రెసు ఇరుతెగలు. గాంధిపక్షమొకటి, స్వరాజ్యపక్షమొకటి. బంగాలసింహము చిత్తరంజనదాసుగారు తమస్వరాజ్యపక్షపు శాసనసభాప్రవేశతత్త్వమును ప్రతిపాదించి కాంగ్రెసునొప్పించుటకు చాలపోరాడిరి. అమాత్య రాజగోపాలాచార్యులవారియెుక్క వారిఅస్త్రముపారలేదు, కాని మనసులుమాత్రము గాయపడినవి. కాంగ్రెసుగతి కృంగినది. ఆసమయమున గాంధీజీ చెరసాలలోనుండిరి. అటువైపొకటి ఇటువైపొకటి లాగుచున్న ఈ కాంగ్రెసుగుఱ్ఱముల సారథ్యము నెవరుచేయజాలుదురు! మనలో సంధానచతురులెవరు? అందరి మనసులో నిదేవిచారము. ఆ దరినోటిలో నిదే ప్రశ్న.

## ఏ. వి. దేశికాచార్యగారు, యం. డి. అనర్సు

మరుసటిసంవత్సరము ఢిల్లీలో కాంగ్రెసు విశేషాధివేశనము చేసినపుడు ఆసారథిని కనుగొనిరి. ఢిల్లీలో ౧౯౨౩ లో జరిగినది కాంగ్రెసు కాదు. నిజముగ నదియొుక సంధానసభ. ఆ సందర్భమున నందరికన్నులలో వెలిగినమూర్తి మౌలానా ఆజాదుగారు. అపుడు హిందూస్థానపు జనులింకనూ రాష్ట్రముగ నేర్పడియుండలేదు. గాంధీజీ తపస్సు అప్పటికి చిన్న మొలక గనుక నే మౌలానాఆనాడు వట్టి అధ్యక్షులుగ నుండిరి. నేడు మనము రాష్ట్రముగ ఏర్పడియున్నాము కాంగ్రెసుఅధ్యక్షుడు నేడురాష్ట్రపతి పదునేడు సంవత్సరములవెనుక ఆజాదుగారు ఆపీఠమునెక్కి వారి సౌజన్యసామరస్యముల ప్రబసరింపకుండిన కాంగ్రెసుచరిత్ర నేడెట్లుండియుండునో,

మౌలానా పుట్టినపుడు శాంతిదేవత నడునెత్తిపైయుండెనేమో. వారిజీవితములో శాంతిసామరస్యములే ప్రధానలక్షణములు. కాంగ్రెసుకు గాంధీజీ రాముడైన మౌలానా విభీషణుడు. విభీషణపట్టాభిషేకము రామరాజ్యమునకు మొదటిమెట్టు.

మౌలానాగారి స్వభావమేయింత. అతిసరళము. వారిమాటలలో తర్కచాతుర్యములేదు. శ్రద్ధాగాంభీర్యమున్నది. చర్చలో పూర్వపక్షమునకు తావులేదు. సర్వాధికారవలె శాస్త్రీయదృష్టిజూపుదురు. కాంగ్రెసులో తీక్షణముకుచర్చజరుగుచున్నపుడు వేదికపై చిన్నవిమర్శలు సాగుచుండును. ఆజాదుగారు ఆచర్చనువినుచు విమర్శనల గురిపెంతురు. మొదలె ఎఱ్ఱనైనవారిముఖము ఒకప్పుడు మరింత ఎఱ్ఱబారి చెంగలువవలె వికసించును. ఏమిజరిగిననూ ఉద్రేకమునకు వారిలో చోటులేదు. అదివట్టిఉత్సాహముమాత్రమే. ఒక కానీయిచ్చి కాశి, బొంబాయి పటములను చూచి యానందించు పసివానివలె వారిమనసు సదాప్రసన్నము, సర్వదాప్రశాంతము

ఆజాదుగారి ప్రశాంతిహృదయమునందు సంకోచస్వార్థములకు స్థానములేదు. చిల్లరఅభిమానములు మతావేశము వారిస్థయిర్యమును చలింపలేవు.హిందూస్థానపు రాష్ట్రీయత సంస్కృతుల మూలముపై గొడ్డలిదెబ్బ పడుచున్నది. జనులలో పరస్పరముగ సంశయఅవిశ్వాసములుపెరిగిపోయినవి. గాంధిజీవంటి మహాత్ముడే హిందూముస్లిము సౌహార్దపు ప్రశంసవచ్చినపుడు వణకిపోదురు కాని ఆజాదుగారుమాత్రము అచల శ్రద్ధతోనూ అపారధైర్యముతోనూ ఆప్రయత్నమున దొడగియున్నారు. మన గోకులాష్టమిలో ఈ ఇమాం సాహేబుగారి నిమిత్తమై ఒకఆసనము నిర్మితమైయున్నది.

హిందూస్థానపు ప్రస్తుత రాజకీయరంగమున జరుగుచున్న కామదహనసందర్భమున మనశ్శాంతిని నిల్పుకొనుటకెవరైనను ఎక్కువసామర్థ్యము కావలెను. ఇటువంటి ధర్మమార్గమున నడువక. నిగ్రహమనెడు కత్తిమునుతోడుగక, సర్వమూభగవదధీనమని నమ్మక ఆసామర్థ్యమురాదు. ఆజాదు ముస్లిములలో పేరుపొందిన ధర్మశాస్త్రవేత్త. వారివలె ఇస్లాముధర్మమును కాలానుసారముగ అన్వయముచేసి సమకాలీనపుప్రశ్నల కర్థము జెప్పు మౌలానా హిందూస్థానమున నింకొకడులేడు. ఇస్లాముధర్మపు మూలస్థలములలోనే వీరికి ధర్మదీక్షయైనది. వారిపుట్టుక మహమ్మదీయుల మహాక్షేత్రములో-మక్కాలో ఆపవిత్రసన్నివేశమందే వారు పైగంబరు నిజహృదయమును ఇస్లాముధర్మపు జీవాళమును కనుగొనిరి. ఈజిప్టులోని ధార్మిక విద్యానిలయములో వీరికి శిక్షణ. ఇస్లామీతత్త్వశాస్త్ర, న్యాయశాస్త్రములలో మంచి పాండిత్యమును బొందిరి. అపునాదిపై అల్లాభక్తి, విశ్వప్రేమములతో కట్టిన భవ్యభవనము వారిది.

గడిచినయేడు హైదరాబాదులో ఆర్యసమాజపు ధార్మికసత్యాగ్రహము నడచినది ఇతిహాసప్రసిద్ధము. ఏరీతిగనో దానికి జాతిద్వేషపు- హిందూ ముస్లిముజగడపు రంగువేయబడినది. హిందూస్థానపు మూలమూలలలోనూ అది హిందువులకు ప్రియను ప్రవాదము పొందినది. ఆ సత్యాగ్రహమున కొంచమైన సారమున్నదాయను ప్రశ్న ముస్లిము నాయకుల మెదడుకెక్కలేదు. చిత్తు అయితేనీవోడితివి, బొత్తు అయితే నేనుగెలిచితిని. "Heads I win , tails you lose" అను చక్రతర్కమది. మౌలానా ఆజాదుగారు వారొక్కరే అసత్యాగ్రహము నాశీర్వదించి ఆసరాయిచ్చిన "కాఫిరులు"

ఈ ధర్మపరాయణత, నిష్పక్షపాతములు ఇతరజనులలో కొంతవరకైనను ఆదరణీయములు కావచ్చును. కాని, ఎడమచేత కొరాను, కుడిచేత కత్తిపట్టి "సారెజహాంకు ఇస్లాం బనాయింగే" అనెడి రణఘోషను నమ్మినజనులలో ఆజాదుగారి విశాలతకు మన్నన యెట్లుదొరకవలెను? సత్యపరమేశ్వరుడైన శ్రీరామచంద్రునికి జనులిచ్చినబహుమానమేమి! అపనింద. పరమ జ్ఞానియైన సాక్రెటీసుకు లభించిన సన్మానమేమి? కాలకూటవిషము. ఆజాదుగారికిగూడ బహిష్కారము, విరోధము, కాఫిరుబిరుదమువచ్చినది. వీటికి వారువెరవలేదు. తుదకు కలకత్తాముస్లిములు వీరి ధర్మాధికారమును తిరస్కరించిరి.

బక్రీదు మహమ్మదీయులలో ముఖ్యమైన పండుగ; శైవులకుశివరాత్రి, భాగవతులకు గోకులాష్టమివలె. ఈపండుగలో వేలకొలది మహమ్మదీయులు తమతమగ్రామములలో సమావేశమగుదురు. అచ్చట సాముదాయిక ప్రార్థన జరుగును. కలకత్తాలో చాలకాలమునుండి ఆజాదుగారు వాసమైయున్నారు. ఆనగర బక్రీదుప్రార్థనకు వీరేఇమాం. రెండు సంవత్సరముల క్రిందట వీరముస్లిములు ఆజాదుగారిని తిరస్కరించి మరియొుక ఇమాంసాహేబుగారిని తెచ్చినిలిపిరి. ఇటువైపు గూడ కొంతగుంపుండెను. భద్రాద్రిలో భక్తరామదాసును అర్చకనాయకులు గుడినుండి బయటవేసినట్టి ఘట్టమువంటిది. రామదాసు అక్కడ ప్రవర్తించినట్లే ఆజాదుగారిక్కడనడచిరి. జనులు యిరుపక్షములై రోషద్వేషముల బుసకొల్పి దొమ్మి చేయుటకు సంసిద్ధులైరి. తమది న్యాయము ఎదుటివారిది పరాజయాల అన్యాయము. అయిననూ ఆజాదుగారు ఆప్రసంగమునుండి వెనుజరిగి వచ్చిరి అన్యాయ్యమును హర్షముతో స్వీకరించిరి. హింస అశాంతి రక్తపాతముల మూలకముగ న్యాయమును సాధించుట వారికి సహించలేదు. ఇమాంపదవిసేత్యాగము చేసిరి. ధర్మము పేరట జరుగనున్న ధర్మహత్యను తప్పించిరి. ధర్మమును కాపాడిరి,

రాజకీయము అధికారలాలస బ్రతుకునకేక లక్ష్యముగనుండు కాలమిది. హిందూముస్లిములార్జించిన పిత్రియపుసొత్తు ముల్లా- మౌలానాలదికాదు, ఫకీర్ దుర్వేషులదికాదు. అక్బరు-రాచకొడుకులది అనుగ్రహము. ఈకాలమున ధర్మభావనసన్నగిల్లుట సహజమె. ఇస్లాము ధర్మముకూడ న్యాయనిష్ఠమైనది, ప్రేమపూర్ణమైనది. యనుట మరచి మరపించునంతదూరము జనులు సాగియున్నారు. ఆజాదువంటివ్యక్తు లాకరిద్దరైననూ తమజీవనమున చూపుచుండిన ధర్మమే. నిజమైన ఇస్లాము నింకనూ నిలకొల్పియున్నది వెలిగించుచున్నది.

పర్షియాదేశపు లౌబిన్‌నగరమున క్రైస్తవులు మహమ్మదీయులుకూడి వసింపుచుండిరి, అక్కడ క్రైస్తవుడొకడు గొప్పవర్తకుడుగనుండెను. ఒకనాడొకహాజీ (మక్కాయాత్రచేసినమహనుభావుడు.) వానియంగడికివచ్చి వర్తకుని మహమ్మదీయుడుకమ్మనికోరెను. వర్తకుడుఅంగీకరింపలేదు. అంగడికివచ్చిన సత్పురుషుని వట్టిచేతులతో పరిపరాదని భిక్షమివ్వబోయెను. అహాజీకికావలసినది భిక్షకాదు. మతపరివర్తనము అట్లు చెప్పి భిక్షను తిరస్కరించెను తరువాత చర్చపెరిగి హాజీకి కోపమువచ్చెను. అందున్న కావలివాని చేతిలోని కత్తినూడబెరకికొని కోపభరమున వర్తకునిపొడిచి పరుగెత్తెను. నగరాధిపతి మహమ్మదీయుడు. వానికిది తెలిసెను. అహాజీనిపట్టి తెప్పించి తనచేతులారవానిని పొడిచిచంపెను, "మహమ్మదీయధర్మము నిట్లనాప్రచారముచేయుట? ఛీ!కుక్కా!" అని వానిదేహము కుక్కలపాలు చేసెను.

మౌలానాను తలచినపుడగతీయూ ఈకథ జ్ఞాపకమునకు వచ్చును.

(సశేషము)

# మహబూబునగరం జిల్లావార్తలు

## గద్వాల సంస్థానము

బోరవెల్లి

ఏరువాకపున్నము-అపూర్వమైన, విచిత్రమైన, ఊరేగింపు

(ప్రత్యేక విలేఖరి)

బోరవెల్లిఅను గ్రామము గద్వాల సంస్థానములోచేరినది. అలంపూరు తాలూకా పరిధులో నున్నది. ఈప్రాంతమున జ్యేష్ఠ శు॥ ౧౫ (ఏరువాకపున్నమ) నాడు యెద్దుల ఊరేగింపు ప్రతి గ్రామమున జరుగుచుండును. ఆదినము ఆగ్రామమున భాగిరెడ్డి లక్ష్మమ్మయను స్త్రీకి గ్రామప్రజలు నీకనుగోని ఒకచేతను ఒకచేత్రవేటను కొటుచేసి గాడిదపై కూర్చుండబెట్టి మెడకు వుల్లిగడ్డ పూలువేసి ముఖమంతట పసుపు సున్నము నల్ల బొట్లుబెట్టి బాజాభజంత్రీలతో వీధివీధి సందులు సందులో ఊరేగింపుచేసినట్లు సంగతితెలియుచున్నది.

ఈగ్రామపు పటేలగిరి సంపాదించి యీ ౫ సంవత్సరములనుండి గ్రామమందధికారము జరుపుచుండినది. ఈ మెవలన ఆగ్రామమున వర్గద్వేషము లేర్పడి ఈమె ప్రతిపక్షులకు కష్టములు కలిగించినందున వారు ఈవిధముగు మన్ననజరిపినారని వింటిని.

## మక్తల్

వెల్లి ( ) వెంకప్ప జాతర

పైన గనపరచిన మండలీకరణమున నొకబూతుశబ్దముచే ఈజాతర వ్యవహరింపబడుచుండును. జ్యేష్ఠ శు॥ ౧౫లు (ఏరువాక పున్నమ) పండుగ మరుదినము ప్రతియేట ఈజాతర మక్తలులో జరుపబడుచుండును. ఆనాడు ప్రజలు కుక్కలకు, గాడిదలకు, రవికెలు అంగీలు మొదలగు వస్త్రములచే నలంకరింపజేసి వాటిని తరుముచుందురు. గుట్టములపైన స్వారిచేయుచుందురు. అట్టిసందడిలో మనుష్యులు ఒకరిపై నొకరుచుట్టుకపడుచుందురు. అప్పుడుఅల్లరిచేయుచు కేకలువేయుచు చప్పట్లుకొట్టి నవ్వుచుందురు. ఇట్టిజాతర ఈ లాటివేడుకలతో ప్రతియేట మక్తలులో జరుగుచుండును.

## చేదుడుబావిలో విషము కలుపుట

(టంకరమహబూబ్నగరం) ౨౯ అమర్దాదు

మహబూబ్నగరమునకు ౭ మైళ్ల దూరములో నుండు టంకర గ్రామములో ౨౬ తేదీ ఖుర్దాదు రాత్రి జొన్నలసిద్దయ్యగారి యింటి యొకుట ఆవరణములోనున్న చేదుడుబావిలో యెవరో విషముకలిపినారనియు మరునాడు నీళ్లుచేదగా నీళ్లునురుగుతోనుండినందున యింటివారు అనుమానపడి పోలీసుకురిపోర్టుచేయగా హామమహబూబ్నగరము హెల్తుఆఫీసరుకు తెలుపగా వారానీటిని ధ్రువపరచి హైద్రాబాదు కెమికలు యెగ్జామినరుకు (రసాయన పరీక్షనిక) పంప నీటిలో విషమునట్లు అభిప్రాయమిచ్చినారనియు ప్రస్తుతము ఈనేరము పోలీసువిచారణలోనున్నట్లు సంగతి తెలిసినది

### దొంగతనము

ఇదేటంకర గ్రామములో గద్వాల సిద్దప్ప అను వారి యింటిలో ౧౨ అమర్దాదు సోమవారము నాడు రాత్రి ౩౦౦ పైనవగదు ఇంచుమించు ౧౫౦౦ విలువగల బంగారున్ను దొంగతనము ఆయినది. ప్రస్తుతము ఈకేసు పోలీసువిచారణలో యున్నది. పోలీసుఉన్నతాధికారులు టంకరలో నేయున్నారు.

## జడ్చర్ల వార్తలు

దొంగతనమేమయ్యెనో ఏమో?

సుమారు రెండు మాసాలక్రిందట ఇచ్చట సంస్కృత పాఠశాలనునడుపుచు సంస్కృత విద్యను కొందరిబాలురకు నేర్పుచు అత్యుత్తముడనియు, పరమసాత్వికుడనియు ప్రసిద్ధిగాంచిన బ్రహ్మశ్రీ వెల్లాల శంకరశాస్త్రిగారను వారిబిడ్డకు పెండ్లిఅయ్యెను. చుట్టాలుయింటికివచ్చిరి. ఆనాడు రాత్రియే ఇంటిలో యెవ్వరో పెండ్లికొఱకువుంచ పెట్టినసొత్తులను పెట్టెలనుండినట్టివి దిడ్డిద్వారము నుండివచ్చి యెత్తుకొనిపోయిరి. పాపము అమాయకుడైన యీబీదపండితుడు ఉన్న అకొద్దిఆస్తిని పోగొట్టుకొని దిక్కులేనివాడయ్యెను. వ్యవహారరీత్యా పోలీసువారికి ఈదొంగతనపువార్త తెలుపుకునబడెను. పండితుడు ఈగ్రామాన్ని వదలి స్వస్థానమను కొల్లాపురసంస్థానములోని అయ్యవారిపల్లె అనుగ్రామానికిపోయెను. దొంగతనమై రెండు నెలలైనా యింతవరకు దొంగలజాడగాని సొత్తుజాడగాని దొరకకపోయెను.

## సిద్దిపేట సనాతనధర్మ ప్రచారము

సనాతనమండలిశాఖ

హిందూమతప్రచారకులు శిరోమణ్యద్ధారక ఉపన్యాస చక్రవర్తి బ్ర. శ్రీ. ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారు,సికింద్రాబాదు వాస్తవ్యులు శ్రీ ఉప్పుల నాగభూషణం సేటుగారు శ్రీ నాగిళ్ల క్రిష్టయ్య సేటుగారున్ను మాగ్రామమునకు దయచేసి కన్యావివాహ నిషేధశాసనమునుగురించి ప్రచారముచేయుచు ఆశాసనము హిందూమతవిరుద్ధమని మాగ్రామస్థులందరికి తెలిపి హిందూ స్త్రీపురుషులనుండి సంతకములుగైకొనిరి. శ్రీపండితులవారు జయగోపాలసేటుగారి దుకాణమువద్ద కన్యావివాహమునుగురించి చాల చక్కగా నుపన్యసించిరి. ఇక్కడ నొక సనాతనధర్మసభ స్థాపింపబడినది. ప్రభుత్వ శాసనసభలో ప్రవేశపెట్టబడిన కన్యావివాహ నిషేధపు బిల్లు ధర్మవిరుద్ధముగాన దానిని శాసనముచేయగూడదని మ. ఘ. వ. శ్రీనిజాంప్రభుత్వమువారిని ప్రార్థించుచు ఏకగ్రీవంగ తీర్మానించడమైనది.

సభయందుకూడిన వందలకొలది జనులలో ఒక్కరుగూడ వ్యతిరేకముగా ఓటునొసంగలేదు. మరునాడు శంకాసమాధానములకై కాలూరాం శోభారాంగారి దుకాణంలో అవకాశమొసంగబడినది. శ్రీకొర్తివాడ శీతారామయ్యగారి కుమారుడు నాగభూషణం తాటికొండ విశ్వనాథం, సాతానిరాములు, సకిలం నాగభూషణం బెజుగం లింగన్న మొదలగుకొందరువేదశాస్త్రపురాణములననుసరించి కన్యావివాహములు ప్రశస్తములా లేక యువతీవివాహములు శ్రేష్ఠమా అని ప్రశ్నించిరి, శ్రీపండితులవారు వేదప్రమాణములను పురాణప్రమాణములను గనపరచి చక్కగా సమాధానమొసంగిరి. అంతట తమకు శాస్త్రవిషయములతో పనిలేదనియు లోకమున దురాచారములు ప్రబలినవనియు వానిని మాన్పచేయవలయుననియు అంతవరకు శాస్త్రముల విశ్వసింపమనియు తెలిపిరి.

శాస్త్రముల నాశ్రయించిరేయే దురాచారము నవరించుట కవకాశముకలదు గాన శాస్త్రము విశ్వసింపమని యనుట అయుక్తమని నాటిసభను ముగించిరి.

## స్త్రీహత్యాపరాధి పట్టుపడినాడు

(స్వ. వి.)

మహబూబునగరము అమర్దాదు ౨౬

ఎంకమ్మయను యువతిని చంపి రైలుకట్టదగ్గర పడవేసిన హంతకుడు తా౧౫ అమర్దాదు రఘునాథపురంలో పట్టుపడ్డాడు. వీనిని అబ్దుల్అజీజ్ జమెదారు రైల్వేపోలీసుఅమీనుకలిసి మిగుల ప్రయాసతో పట్టినారు. వీడు బాదేపల్లిలోవుండేవాడట. పూర్వము వీనితల్లికూడ అక్కడ వున్నట్లు తెలిసినది. వీనిపేరు అబ్దుల్సలాం నౌముస్లిం వీడు ఇంకొకనేరాన్నికూడ చేసెనని అనుకొనుచున్నారు.







# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఆషాఢ శు॥ ౨

గురువారము


## పేష్కారీ లోకల్ ఫండు నివేదిక

౧౩౪౮ ఫసలీ సంవత్సరపు మహారాజా సర్ ప్రసాదు బహద్దరు గారి సంస్థానములోని లోకల్ ఫండు శాఖానివేదిక మాకందినది. ఈసంస్థానమునకు శ్రీయుత గుండేరావుగారు కార్యదర్శిగా నుండుట సంస్థాన ప్రజల అదృష్టమనవలెను.

సంస్థానాలలో నివేదికలు ప్రకటించు పద్ధతి తక్కువ. ఒకటి రెండు తావులలో నేకలదు. ఈపేష్కారీసంస్థానమున్ను శివరాజబహద్దరు సంస్థానమున్ను నివేదికలను ప్రకటించుచున్నవి. శివరాజబహద్దరు సంస్థాన నివేదికలు రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారి అధ్యక్షతాకాలములో పొందుచుంటిమి. ఇప్పుడా విధానమున్నదో పోయినదో మాకుమాత్రము మా నివేదికలు రానందున ఏమియు నిర్ణయించజాలము. తక్కిన సంస్థానాలు, పాయిగాలు, జాగీర్లు ఈ పద్ధతిని అవలంబించుట చాలముఖ్యము.

మాకు చేరిన యీ క్రిందినివేదికలోని అంశాలు చాల తృప్తికరముగా నున్నవి. ఈపేష్కారీ సంస్థానములో లోకల్ ఫండుశాఖ యేర్పాటు చేసినదేగాక కేంద్రశాఖ ౨ మంది అనధికార సభ్యులును ౨ మంది అధికారసభ్యులను కలిగియుండుట చాల మంచిమాట. మరియు తాలూకాలలోను ఇదేవిధముగా లోకల్ ఫండు సంఘాలను ఏర్పాటు చేసినారు.

ఈనివేదికలోని ఇంకొక విశేషమేమన ఇది ౧౩౪౮ వ సంవత్సరముది. అనగా గతసంవత్సరముది. సకాలములో ఏమీన్ని ఆలస్యములేకుండా సిద్ధమైనది. అందుకు మేము సంస్థానాధికారులను అత్యంతముగా ప్రశంసించుచున్నాము. ఈ నివేదికా కాలములో మొత్తము లోకల్ ఫండు ఆదాయము ౫౧౮౫౫ రూపాయలు. ఖర్చు ౫౧౯౫౮. అనగా లోభగుణము చూపించకుండా ఆదాయాన్ని బాగుగా వ్యయము చేసినారని తెలియగలదు.

ఈ లోకల్ శాఖవారు విద్యపై మంచిశ్రద్ధ తీసుకున్నారు. పాఠశాలలు పూర్వము ౧౫ ఉండినవి. ఇప్పుడు ౫౫ కలవు. విద్యార్థులసంఖ్యలో ౮౧౯ మంది ఎక్కువై మొత్తముమీద ఇప్పుడు ౩౦౯౨ మంది చదువుకొనుచున్నారు. నాలుగు మాధ్యమికపాఠశాలలున్నవి. మొత్తము విద్యపై ౩౩౦౧౯ రూపాయలు వ్యయముచేసినారు. ఇదికూడ చాల గొప్పవిషయము. ఎందుకన ఇందులో నాల్గవభాగముకూడ ఇట్టి యితర సంస్థానాలుగాని, ఇంతకుమించిన సంస్థానాలును పాయిగాలును వ్యయముచేసినట్లు కానరాదు. ఈనివేదికాకాలములో ఫరుఖ్‌నగర్‌లో రెండు తెలుగుబళ్ళు స్థాపింపబడినవని వ్రాసినవాక్యము మాకుఇంకా ఆనందముకలిగించినది. దిక్కులేని తెనుగు, మరాటీ,కన్నడీభాషలకును ఎక్కడెక్కడ కొంచెమాత్రమైనను ఆదరణ కలుగుచుండునో అదియు ఒక ఘనకార్యమే యనియు, గొప్ప అనుగ్రహమే అనియు భావించుకొనవచ్చును. అయితే యింకా ఈపేష్కారీలో ఎన్ని తెలుగుబళ్ళుకలవో ఎన్ని మరాటీబళ్ళు కలవో ముందు నివేదికలలో స్పష్టపరుచుట బాగుండును.

పేష్కారువారు వైద్యవిషయములోను తగినంతశ్రద్ధ తీసుకొన్నారు. వైద్యాలయాలు యూనానీ ఆయుర్వేదాలయాలు సహాయకవైద్యసంస్థలు నెలకొల్పి బీదలకు చికిత్సలుచేసి పుణ్యముకట్టుకొనుచున్నారు.

ఒకటి రెండు తావులలో గ్రామపునర్నిర్మాణ పద్ధతులనుగూడ ఏర్పాటు చేసినారని తెలిపినారు. ఈలోకల్ ఫండు వారింకను ప్రజలకు ఎక్కువసేవచేసి ప్రజల దీవనలకు పాత్రులగుదురుగాక. ఇప్పటిపద్ధతిచూచిన వీరు చాల మంచి శ్రద్ధ తీసుకొనుచున్నారనక తప్పదు.

## పశు వైద్యశాఖ

౧౩౪౭ ఫసలీ సంవత్సరపు హైదరాబాదు ప్రభుత్వపశువైద్యశాఖానివేదిక మాకందినది. పశువుల రోగాల చికిత్సలు చేయు పశు చికిత్సాలయముల నెలకొల్పుటలోను పశువుల పాలను వృద్ధిచేయుటలోను మంచి శ్రద్ధతీసుకొన్నారు. అందుకువారు ప్రశంసాపాత్రులు. ఇప్పుడు ప్రతి తాలూకాలోను ఒక పశువైద్యాలయ మున్నదని అనుకొనుచున్నాము. అయితే ఈ రాష్ట్రములో తాలూకాలు సుమారు ౧౪౦ కి పైగా ఉన్నవి. పశువైద్యులు, అమీనులు, సర్జనులు, మదద్గారులు, జమాదారులు, "సాలట్రీలు" వీరంతా కలిసి ౧౩౦ మంది కనబడు చున్నారు. అందుచేత ప్రతి తాలూకాలో ఒకపశువైద్యున్నాడో లేడో మాకుస్పష్టము గా ఈనివేదికనుండి తెలియవచ్చుటలేదు.

రోగాలవల్ల చచ్చినపశువుల పట్టిలను చూపించినారు. అందు ఎక్కువ పశువులు౧ రైండర్ పెస్టు, ... కాళ్ళలోను నోళ్ళలోను కలుగురోగాలు, బ్లాక్ క్వార్టర్ అను రోగాలనుండి చచ్చినట్లు కనబడుచున్నవి. విశేషముగా "గాలి" అనే రోగముచే పశువులు పల్లెలలో చచ్చుచుండును. ఇట్టిరోగాలలో ముఖ్యమైన వేవో వాటికి జనులు చికిత్స చేసుకొనుట యెట్లో స్వయముగా చేసుకొనవలెను... వైద్యుల ఇంజక్షనుల అవసరముండిన తాలూకా ప్రజలు ఏ కేంద్రమునకు ఎప్పుడు తెలుపుకొనవలెనో అను విషయాలను, ఆయా రోగాల చికిత్సలను ముఖ్యభాషలలో అచ్చువేసి, పల్లెలలో పటేలు పట్వారీల ద్వారా ఉచితముగా పంచిపెట్టవలెను. వ్యవసాయశాఖవారు తమకు సంబంధించిన విషయ... కొన్ని అచ్చువేసి... ఈశాఖవారును అట్లు చేయుచున్నారో లేదో ఈ నివేదికలో ఎందైన అవిషయమున్నదో యేమో మాదృష్టికిరాలేదు. ఒకవేళ అట్లు చేయుచుండిన చాలాసంతోషము. ఆప్రకారం చేయకుండిన ఇకముందైనా చేయుదురని మనవి చేసుకొనుచున్నాము. పశువులనష్టం రైతుకు అన్నినష్టాలలో గొప్పనష్టము. బీదరైతుకు కోడలు చచ్చిన ౫౦—౬౦ రూపాయల ఓలియిచ్చి మరొక కోడలిని తెచ్చుకొనును. మంచికోడె చచ్చిన ౧౦౦ రూపాయలకుపైగా నిచ్చుకోవలసియుండును మన రైతులు పశువులవల్లనే నాశనమగు చున్నారు. మోటకొట్టు తెలంగానా రైతులకు తొందరగా పశువులు చచ్చును. మోటకొట్టని మరాట్వాడా రైతుల కోడెలు మంచివి, ఒక జోకటి ౨౫౦ నుండి ౫౦౦ రూపాయల వరకు క్రయము చేయునట్టివి. కావున వారినష్టముకూడా తక్కువదికాదు. పశుశాఖ వారిప్పుడు చేయుచున్న కృషికి రైతులు కృతజ్ఞత చూపవలెను. వారికి అవసరము వచ్చినపుడు తమ తాలూకా పశువైద్యుల సహాయమును వెంటనే పొందవలెను. పశుశాఖవారును సర్వవిధాల రైతులకు సహాయము చేయువారై యున్నారు.

నివేదికలో పశువుల వృద్ధికి మంచివిత్తనపు కోడెలను రైతులకు సప్లయి చేయుటలోను శ్రద్ధను తెలిపియున్నారు. ఇదికూడ మెచ్చుకొనదగినదే. ముఖ్యముగా ఈశాఖవారు రైతులకు చాలా సహాయము చేయుచున్నారని తెలుసుకొనుట కానందించు చున్నాము.

## ఇత్తెహాదువారి—యుద్ధచర్చ

అంతయు రహస్యమే!!

హైదరాబాదు(దక్కన్) షహరేవరు౧

౩౦ అమర్దాదునాడు హైద్రాబాదు నగరములో న. బహద్దరుయారుజంగుగారి బంగ్లాలో అంజుమనె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘ కార్యనిర్వాహక సభ్యులు సమావేశమై సాయంత్రము మూడుగంటలు తలుపుబంధించుకొని రహస్యాలోచనలు చేసియుండిరి. తర్వాతవార్తయేమన—ఆదేనాడు రాత్రి మరల ౯॥ గంటలకు రాత్రి ౨ కొట్టువరకు అనగా ౪॥ గంటలకాలము ఆలోచనలు చేసిరి. తరువాత యెవరియిండ్లకువారు పోయిరి. వారేమి తీర్మానించుకొన్నారో పత్రికలకు తెలుపరట.

దక్కన్ న్యూసువారిట్లు పత్రికలో తెలిపినారు. "సంగతి సందర్భాలు తెలిసినవారిద్వారా తెలిసినదేమనగా ఇత్తెహాదువారు యుద్ధమునుగురించి చతుర్ముఖాల ఆలోచించినారు, హిందుస్థానముపై అందు ముఖ్యముగా హైద్రాబాదుపై యుద్ధముయొక్క ప్రభావము (అసర్) ఎంతవరకు అను విషయాన్ని ఆలోచించినారు. పూర్వము వీరుచేసిన ప్రకటనలు వీరి జిల్లాసంఘాల అభిప్రాయాలు అధ్యక్షులు తమ ఉపన్యాసాలలో సూచించిన పాలిసీ ఇవన్నియు దృష్టియందుంచుకొని ఆలోచనలుచేసినారు. వైస్రాయిగారు, ఇండియామంత్రిచేసిన ప్రకటనలుకూడ చర్చకువచ్చినవి. తుదకు ఇత్తెహాదువారు తమ భావివిధానమును నిర్ణయించుకొన్నారు. తమ అధ్యక్షులును ఖాయదెమిల్లత్ గారును అగు బహదరుయార్జంగు బహదర్ గారికి తగుచర్యల నైకొనుటకు అధికారమిచ్చినారు. అంజుమనువారిప్పుడు ఏప్రకటనగావించు అవసరములేదని అభిప్రాయపడినారు."

## నిజామియా కళాశాల

హైదరాబాదు(దక్కన్). షహరేవరు౩

హైద్రాబాదు నిజామియాకాలేజి యొక్క వార్షికోత్సవము ౭ జులైనాడు నవాబ్ సయ్యద్ అబ్దుల్ అజీజుమంత్రిగారి అధ్యక్షతతో జరిగెను. కృతార్థులైనవిద్యార్థులకు మంత్రిగారు సనదుల నిచ్చుచు మతవిద్యాప్రాముఖ్యతను గురించి బోధించిరి. ఈ సభకు నవాబ్ సర్ అక్బర్ హైదరీ ప్రధాన మంత్రిగారు విచ్చేసియుండిరి.

## నిరుద్యోగముచే ఆత్మహత్య

నిజామాబాదు, షహరేవరు ౧

నిజామాబాదుజిల్లాలోని ఆర్మూరు తాలూకాలో చేరిన బాబాపురము గ్రామములో ౪౦ ఏండ్ల వయసుగల ఒకడు నిరుద్యోగబాధపడి ఉపవాసములతో నిన్నఉదయము ఆత్మహత్యగావించుకొనినట్లు తెలిసినది.

౨౯ అమర్దాదు ౧౩౪౯ ఫ. నాడు జనగాం దగ్గర రైల్వేడీసెల్ కారుక్రింద రైలుపట్టాలపై ఒకవ్యక్తి కావలెనని పడిచచ్చినట్లు తెలియుచున్నది. రఘునాథపల్లి స్టేషనునుండి రైలుకారు వచ్చినపుడు అవ్యక్తి కట్టెలబండివద్ద నిలిచియుండెను. రైలుమోటారురాగానే అతడు అకారుక్రింద పడెనట. వెంటనే అతని తల చూరచూర అయి అతడు మరణించెను. పోలీసువారు పరిశోధన జేయుచున్నారు.

## బిదరుఅల్లరుల నివేదికపై న్యాయస్థాన ధిక్కారాభియోగము

హైదరాబాదు(దక్కన్)షహరేవరు౩

వై. డీ. జోషీఅనువారు హైద్రబాద్ స్టేటు కాంగ్రెసు ప్రజామండలి కార్యదర్శి. అతడును బీ. ఏ. పాటిల్ గారును, మారుతీరావు జోషీగారును, ప్రేమకుమారుగారును, యస్. బీ. గోరేగారును బిదరు అల్లరులనువిచారించి ఒకనివేదిక సిద్ధము చేసి పత్రికలలో ప్రకటించియుండిరి. బిదరు అల్లరుల విచారణ కోర్టుకెక్కినకాలము వీరిట్లు అభిప్రాయప్రకటనము చేయుట శాసనవిరుద్ధమనియు, న్యాయస్థానము ధిక్కరించు నేరములో చేరుననియు వైవారిపై ఒక అభియోగము తేబడెను. అది గతఆదివారము ౭జులైనాడు హైకోర్టులో న్యాయమూర్తులగు అబూసయ్యదు మిర్జాగారును మ॥ ఖలీలుజ్జమా సిద్ధిఖీగారును కూడిన న్యాయస్థానములో విచారణకువచ్చెను.

నిందితులు తమతమ వాఙ్మూలాలను వ్రాతమూలకముగా ఉన్నత న్యాయస్థానములో సమర్పించుకొనిరి.

జోషీగారిట్లనిరి—"నేను బిదరుఅల్లరుల నివేదికను ప్రకటించినాను కాని దానిని రాష్ట్రమంతటను వ్యాప్తిచేయలేదు. పైగా నావ్యాసము కోర్టులోని కేసులతో సంబంధించియుండలేదు. సద్బుద్ధితో ప్రభుత్వమువారికి యథార్థమును తెలుపుటకై నేను దానిని ప్రకటించినాను"

యస్. గోరే గారిట్లు తెలుపుకొనిరి—"నాకు ఆనివేదిక సంబంధంలేదు, నేను బిదరుకుపోలేదు. విచారణలో పాల్గొనలేదు. కావున నాపై అభియోగము తెచ్చుటకు కారణమేలేదు"

తక్కినవారిట్లు తెలుపుకొనిరి—"మేము కోర్టు ధిక్కారమును చేయలేదు. నున్ముల ఏర్పాటు చేసిన కమిటీవారికి మేము మానివేదికను సమర్పించుకున్నాము."

హైకోర్టులో ఈయిగురిపైన ఉక్తవిధముగు వివరాలతో అభియోగము తేబడెను. ఈఅయిదుగురు బిదరుకువచ్చి మార్చి ౧౯౩౮ వాడు వెళ్ళినారు. బిదరుఅల్లరుల విచారణ అచ్చట ప్రారంభించినారు. ౨౭మార్చినాడు పోలీసువారు అల్లరుల సంబంధములో కొన్ని చాలానులుచేసినారు అవి కోర్టువిచారణలోనుండెను. ఈఅయిదుగురు నివేదిక పూర్తిచేసుకొని ఒకస్థానిక ముద్రాక్షరశాలలో ఒకవ్యాసాన్ని ముద్రించినారు. అందు అల్లరులకు రంగునిచ్చి క్రొత్తస్వరూపమును కలిగించినారు. దానిని కొన్ని పత్రికలలో ప్రకటించినారు. కొన్ని పత్రికలు అనివేదిక ఆధారముపై విమర్శలుకూడా చేసెను. హైకోర్టువారు విచారణకొరకై ఒక బేంచీ ఏర్పాటుచేసినారు.

## ఖాక్సారుల ఆందోళన శాంతి

ఖాక్సారుల కోరికలనుగూర్చి పరిష్కారమగునట్టులను ముస్లింలీగుకు అవకాశమిచ్చి, సమరోల్లంఘనమును శాంతింపజేయవలసినదని ముస్లింలీగు అధ్యక్షునకు జిన్నాగారు గావించిన విజ్ఞప్తి ననుసరించి ఖాక్సారునాయకుడగు మహమ్మదు ఇస్మాయిల్ గారు ఖాక్సారుల కోరికలను గూర్చి రాయబారముల ప్రాప్తి యగునంతవరకు శాసనోల్లంఘనమును అప్పటికి ఆపు ... ఇట్లు జూలై ౨౭వ తేదీవరకు ఆగబడియుండును. ఖాక్సారులనాయకుడు ఈసంగతిని జిన్నాగారికి తెలియబరచి, జిన్నాగారిని సర్ సికిందర్ హయాతుఖాను గారితో ఖాక్సారులఆర్డరు వాపసివేయించునట్లు చెప్పవలసినదని కోరినారు.

## స్మారకసభలు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧

హైదరాబాదునగర ఆంధ్రయువతీమండలివారు ౫ జులైనాడు సాయంత్రము రెడ్డిహాస్టలులో గుర్గంటూరాణీగారి అధ్యక్షతలో లేడీ హైదరీ గారి మరణమునకై తమవిచారమును తెలుపుచు తీర్మానము చేసిరి. తర్వాత సంఘాధ్యక్షురాలగు శ్రీమతి ఓబుల్ రెడ్డి సతిగారును, శ్రీమతి సీతాకుమారిగారును పూలచద్దరును తీసికొని మండలితీర్మానాన్ని సర్ అక్బర్ హైదరీగారికి అందజేసిరి.

ఆదేదినమధ్యాహ్నము ఆదే రెడ్డిహాస్టలులో హాస్టలు విద్యార్థులందరును కలిసి ముందుదినము చనిపోయినట్టి ఉస్మాన్‌గంజి మార్వాడీయైన సేటు నానకురాంగారి ఆత్మకు శాంతినిచ్చుటకై ప్రార్థనలుచేసి తమసానుభూతిని సేటుగారికుటుంబానికి తెలుపుకొనిరి. నానక్రాం సేటుగారు రెడ్డిహాస్టలుకు చాలామారులు మంచిసహాయము చేసినట్టివారు.

దొంగతనములు హెచ్చుట.

నిజామాబాదుజిల్లాలో బేముగల్ గ్రామము చుట్టుప్రక్కల ఊళ్లలో దొంగతనములు ఎక్కువగా జరుగుచున్నట్లు తెలియుచున్నది. దొంగలింకను పట్టుపడుటలేదు.

## భారతదేశమునుండి ఇతర దేశాలకు పంపిన యుద్ధ సామగ్రి మొత్తము

సిమ్లా, జులై ౫

యుద్ధారంభమునుండి యిప్పటివరకు యితర దేశములకు యిండియా చిన్నతుపాకులకు పనికివచ్చు ౨౫౦౦౦౦౦ బారుల గుండ్లు, ౨ లక్షల ఫిరంగి గుండ్లు, ౭ వేల రైఫిల్ తుపాకులు, ౧౦ వేల ముళ్ల కంచెలు, ౭ లక్షల దుప్పట్లు. ౩౦ లక్షల గజముల ఖాకీగుడ్డ, ౨౦వేల కోట్లు, ౧౫౦ వేల బూట్సుల జతలు, ౨౩వేల గ్రౌండు షీట్లు ౧౩ వేల గుఱ్ఱపు జీనులు, ౭౫౦౦ గుడారములు పంపెను.

## దేశరక్షణనియమాలక్రింద అరెస్టులు, నిర్బంధాలు

చిట్టగాంగ్, జులై ౫

ఫార్వర్డుబ్లాకులో సభ్యుడగు శ్రీ. ప్రమోద సేనుగారు యిచ్చట దేశరక్షణ నియమాలక్రింద అరెస్టుచేయబడిరి. ఇటీవల అయన కలకత్తా, హౌరా, హుగ్లీలనుండి వెడలగొట్టబడి వారము క్రిందట యిచ్చటికి వచ్చిరి. ఈయనయిల్లు సోదాచేయబడెను. కాంగ్రెసు నాయకులగు అబ్దుల్ హలీము, అబ్దుల్‌రజాకు గారల యిండ్లుగూడ సోదా చేయబడెను, వీరు అరెస్టుచేయబడిరి. సోదాలో పోలీసులు కొన్నిపుస్తకములు పట్టుకొనిపోయిరని తెలియుచున్నది.

ఇదివరకు డిటెన్యూలుగానుండిన భూపేంద్ర సేన, పులినదే, నక్షత్రనంది, ప్రియోదమిత్రే, అర్ధేందుగుహ, ఫణీంద్రదాస్ గుప్తగారలపై కొన్ని నిర్బంధములు విధింపబడెనని తెలియుచున్నది.

కలకత్తా సివిలుగార్డుల చేర్పరచువిషయమై ఒకప్రకటన గావించినందులకు ప్రాసిక్యూటుచేయబడిన శ్రీ రాజేంద్ర దేవుగారు మేజిస్ట్రేటు కోర్టునుండి తిరిగివచ్చుచుండగా దేశరక్షణ నియమాలక్రింద అరెస్టుచేయబడిరి. దేవుగారు రద్దుచేయబడిన బెంగాల్ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘ ధ్యక్షులు.

## మలేరియా జ్వరపీడితులకు ముక్తి

జ్వరాంతర కష్టములు ఆపబడినవి.

మనదేశములో ప్రతిఆరింటిలో ఒకరు మలేరియాజ్వరముచేబాధనొందుచున్నారు. దీనినినిలుపుటకు డాక్టర్లు ఎక్కువశ్రమను తీసుకొనుచున్నారు.

జ్వరముచే క్షీణించినదేహమునకు తిరిగి శక్తిని చేకూర్చవలెనని వారికి తెలుసును. అయితే జ్వరము జీర్ణశక్తిని తగ్గించుటచే ఏఘనాహారమును సహించదు

తేలికయైనది, త్వరలో జీర్ణమగునదియు యైన ఒక ఆహారపదార్థమును డాక్టర్లు కనిపెట్టి ఎందరో రోగులకిచ్చి పరీక్షించిరి. మంచిఫలమొసగినది. అదియే హార్లిక్సు. దీనిసేవచే నరములును రక్తమునకు ఎక్కువపుష్టిలభించును. సర్వాంగములకు చైతన్యముచేకూరును. త్వరలో రోగనివారణమగును. ప్రతిఆస్పత్రులలోను రోగులకుహార్లిక్సునే యిచ్చుచున్నారు. రోగములనుండి నివృత్తులైన ప్రజలెందరో ఈఅద్భుతఆహారమేతమ జీవితమునకు కారణమని కొనియాడుచున్నారు.

## రట్లం సంస్థాన పరిస్థితులు

సంస్థాన ప్రజలకు, డాక్టరు పట్టాభి, జవహర్లాలుగార్ల సలహా

రట్లం, జులై ౫

"కాలచక్రము మహావేగములో పరుగెత్తుచున్నది. దానినెవ్వరును ఆపలేరు, మహాసమర్థులకు కూడ నామరూపాలులేకుండ పోవుచున్నవి. అటువంటిసమయములో భారతదేశము ఒకటి మాత్రము యిప్పుడుకూడా మధ్యయుగములోవున్న రీతిగానే వుండుటకు వీలులేదు మహావేగములో ఉపొంగివచ్చుచున్న స్వరాజ్య ప్రవాహమునకు దాటలేయవలెను. ౨౦ లక్షలమందికంటే తక్కువ జనసంఖ్యయును, ౫౦ లక్షల రూపాయలకంటె తక్కువఆదాయమును కల సంస్థానములను పరిపాలనలో వాటికి నెరువుగనున్న బ్రిటిషు యిండియాలోని రాష్ట్రాలతో చేర్చవలెనని రట్లం సంస్థానప్రజలసభలో చేయబడిన తీర్మానానికి మూలాధారమైన సిద్ధాంతమును రాజప్రతినిధికూడ ఆమోదించినాడు. ఇంతలో యుద్ధమువచ్చుటవల్ల యిట్లుచేయ వీలులేకపోయినది. రట్లాం సంస్థానములో ఒక లక్షమంది ప్రజలుమాత్రమే వున్నారు ౧౦ లక్షలరూపాయలు మాత్రమే ఆదాయము. ఈసంస్థానములో ప్రతిఖాల్సా గ్రామములోను ప్రాథమిక పాఠశాలయు ఒక ఆస్పత్రియు మాత్రమే వున్నవి. దివానే విద్యాశాఖాధికారిగాకూడ వున్నాడు. ఈసంస్థానములో వ్యవసాయదారులకు అప్పునిచ్చు బ్యాంకి ఒక్కటికూడ లేదు. ఒక్క సహకారసంఘమైనలేదు" అనియు భారత సంస్థానప్రజా సంఘపు పూర్వాధ్యక్షుడు డా॥ భోగరాజు పట్టాభిసీతరామయ్యగారు చెప్పినారు.

## 33 అంగుళాల ఎత్తుగల ౩౨ ఏండ్ల మనిషి.

జమ్ములమడుగు, జులై 3

33 అంగుళముల ఎత్తుగలమనిషి ఇచ్చట రెండురోజులుగ మకాం వేసియున్నాడు. ఈతనివయస్సు ౩౨ సంవత్సరములు. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము, అరవము, కన్నడము: హిందూస్తానీ భాషలలో మాట్లాడగలడు. ఇంగ్లీషు, తెలుగు చదవను వ్రాయను వచ్చును. యస్. యస్. యల్ సి. వరకు చదివినాడట. మంచి తెలివితేటలు చాకచక్యముకలవాడు హాస్యము, సంగీతము, మొదలగునవి ప్రదర్శించి ధనము సంపాదించుకొనుచున్నాడు. పెండ్లి అయినదట. ౨ ఏండ్ల కూతురుగలదని చెప్పుచున్నాడు, ఈవింతమనిషిని చూచుటకు జనులు తండోపతండములుగ వచ్చుచున్నారు. ఈతడు ఎచ్చటికైనను బయలుదేరిన, వీరివెంబడి రామదండువలె ఒక గుంపువుండును. ఈతడు బయట వచ్చునపుడు ఇంగ్లీషు డ్రెస్సులో వుండును. ఈతని తూకము ౧౮ పౌన్లు, వెంబడి ఒక పరిచారకుడు వుండును.

(ఆంధ్ర పత్రిక)

"రట్లం సంస్థానములో ప్రజామండలులను యేర్పరచి ప్రజలందరును వీటిలో చేరిన వీటికి బలము చాల అధికమగును. సత్యము, అహింస వీటియందు గట్టినమ్మకముతో సంస్థానాల ప్రజలందరును యేకీభవించి పనిచేసిన సంస్థానాలలో కూడ ప్రజాపరిపాలనము యేర్పడును. ఇది ఒక్కటేమార్గము. అని యిప్పుడు అఖిల భారత

## శ్రీ సుభాష్‌బోసు అరెస్టుకు అసమ్మతి

బొంబాయి జులై ౫

బొంబాయి రాష్ట్రీయ కాంగ్రెసు సంఘసాధారణసమావేశము నేడు జరిగెను. కాని సుభాష్‌బోసుగారిని అరెస్టు చేసినందువలన సభవారు కార్యక్రమమును నిర్వర్తింపకుండ సభను అపుచేసిరి.

కరాచీ, జులై ౫

బాబు సుభాష్‌బోసుగారి అరెస్టుకు అసమ్మతి దెలుపుటకుగాను నేటిసాయంకాలము కరాచీ మునిసిపల్ కార్పొరేషనుసభ ఆపివేయబడెను.

కలకత్తా, జులై ౫

"సుభాష్ రోజు" జరుపుటకుగాను నేడు శ్రద్ధానంద పార్కులో సభజరిగెను ఈసభకు హిందువులును, మహమ్మదీయులును చాలమంది విచ్చేసిరి.

ప్రభుత్వమువారిచర్యను నిరసించుచు సభవారు తీర్మానము గావించిరి. హాల్వెల్ శిలావిగ్రహమును తొలగింపవలెనని వారుకోరిరి. బోసుగారిని వెంట నేవిడుదలచేయవలెనని సభవారుకోరిరి.

దక్షిణ కలకత్తాలో శ్రీ నీహారేందుదత్తు, ఎం. ఎల్. ఏ. గారి ఆధ్యక్షతను దేశప్రియ పార్కులో మహాసభ జరిగెను,

సంస్థాన ప్రజాసంఘమునకు అధ్యక్షుడుగావున్న జవహరులాలుగారు ఢిల్లీకి వెళ్లను దారిలో రట్లం సందర్శించినప్పుడు ఆహ్వానమువచ్చిన రట్లం సంస్థాన ప్రజల సభలో చెప్పిరి.





## వైస్రాయిగారితో హిందూ మహాసభాధ్యక్షుని భాషణము

సిమ్లా, జులై ౫

అఖిలభారత హిందూ మహాసభాధ్యక్షుడగు వి. డి. సావర్కరుగారు నేడుమధ్యాహ్నము ౩౹౹గంటలకు వైస్రాయిగారి మందిరమునకు పోయిరి. అక్కడ సాయంకాలము ౫ గంటలవరకు అనగా ౧౹౹గంటలసేపు సావర్కరుగారు వైస్రాయిగారితో మాట్లాడిరి.

వైస్రాయిగారు తెలిపినసంగతులు సంతృప్తికరముగా లేవు. వారు యేవిధమైన సూచనలను గానిచేయలేదు. కాంగ్రెసు, ముస్లింలీగుపార్టీల వారి అభిప్రాయములనుగురించి ప్రభుత్వము వారాలోచించినప్పుడు హిందూమహాసభవారి అభిప్రాయములను గురించికూడ ముఖ్యముగా ఆలోచించగలమని వైస్రాయిగారు వాగ్దానము చేసియుండిరి, రాష్ట్రాలలో బిన్నపక్షప్రతినిధి మిశ్రమ మంత్రివర్గములు యేర్పడుటవల్ల హిందువులకు నష్టముకలుగకుండ వున్నచో మిశ్రమంత్రివర్గము లేర్పడవలెననియే నేను ముఖ్యముగా కోరుదును. ముస్లింలీగువారితో సమాధానపడుటకు హిందూ మహాసభవారిదివరకు చాలసారులు ప్రయత్నించి విఫలులైరి. హిందువులమైనని ముసల్మానులు మనఃపూర్వకముగా కోరియడల అందుకు హిందువులు యెల్లప్పుడును సిద్ధముగానే వుందురు" అని సావర్కరుగారు రాజప్రతినిధి మందిరమునుంచి వచ్చినతరువాత విలేఖరులతో చెప్పిరి.

సావర్కరు అనీగారితో మాటలాడుట

సావర్కరుగారు వైస్రాయిగారి మందిరమునకు వెళ్లుటకు పూర్వమే ఎం. ఎస్. అనీగారితో ౧౹ గంటసేపు, మాటలాడిరి,

ఈనెల మూడవవారములో బొంబాయిలో అఖిలభారత హిందూమహాసభ కార్యసంఘ సమావేశము జరుగును, అప్పుడు వైస్రాయిగారు తెలిపిన సంగతులను సావర్కరుగారు కార్యసంఘసభ్యులకు తెలియజేసెదరు.

సావర్కరుగారికి అల్పాహారవిందు

సావర్కరు వైస్రాయితో మాట్లాడివచ్చిన తరువాత ఢిల్లీ హిందూనాయకులు సావర్కరుగారి గౌరవార్థము అల్పాహారవిందుచేసిరి, అవిందుకు చాలామందివచ్చిరి, "వైస్రాయి తెలిపినవిషయములలో కొన్ని సంతృప్తికరముగాను వున్నవి. భారతస్వరాజ్యమునుగురించి యిప్పుడు ప్రభుత్వమువారు మరల ఒకప్రకటన చేసేటట్లు నాకు సూచనలేవీ కనుపించలేదు" అని సావర్కరుగారు విందుసభలో చెప్పిరి.

చాతుర్మాస్యమహోత్సవము

సమస్త వైష్ణవులకు తెలియజేయునదేమనగా, శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి నిత్యతదీయారాధనము, ఉభయవేదాంత గ్రంథకాలక్షేపాశ్రయములున్ను శ్రీరంగములో శ్రీ అహోబిలమఠము దశావతారసన్నిధిలో జరుగును.

ఆషాఢపూర్ణిమ శుక్రవారం ౧౯–౭–౪౦ శ్రీ అహోబిలమఠం శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధిలో ౪౧వ పట్టములో మూరాంభి పిస్టడై వేంచేసియుండు శ్రీవణ్ శఠకోప శ్రీలక్ష్మీనృసింహ శఠకోపయతీంద్ర మహాదేశికులవారికిన్ని, వారిచేతే ౪౨వ పట్టమునకుగాను నియమింపబడిన శ్రీవణ్ శఠకోపశ్రీరంగ శఠకోపయతీంద్ర మహాదేశికులవారికిన్ని చాతుర్మాస్యసంకల్పమహోత్సవము ఉపక్రమింపబడి జరుగబోవుచున్నది కనుక యీమహోత్సవమునకు అందరువేంచేసి సేవించి శ్రీవార్ల యొక్క అనుగ్రహఫలము [illegible]

[illegible]

ఏజంటు — శ్రీకార్యం [illegible] మాడభూషి.

[illegible]

## హిందూ ప్రజామండలి ప్రచారము

(స్వ. వి.)

మహబూబునగరము, అమర్దాదు ౩౦

పైమండలిదిక్కునుండి ప్రచారముచేయుటకై శ్రీయుత చంద్రపాల్, సహాయ సెక్రెటరీగారు మొన్న ఆదివారమునాడు ఇక్కడికి దయచేసిరి. ఇచ్చటి శ్రీరామచంద్రయ్య వకీలుగారిని సెక్రెటరీగా ఏర్పాటుచేసి ప్రచారమునకు తగుసౌకర్యము కలిగించిరి. ముందు జరుగబోవు సభకై డెలిగేట్సును సభ్యులనుచేయు బాధ్యతకూడ యిచ్చినారు. ఇచ్చట కృషిజరుగుచునేయున్నది.

వీరు సోమవారమునాడు నారాయణపేటకు వెళ్ళి ఆర్యసమాజమందిరములో "ఆర్యులననేమి" యను శీర్షికపై యుపన్యసించిరి. మందిరమునిండ జనసమూహముగూడి నిశ్శబ్దముగా వినిరి.

మంగళవారమునాడు లింగాయాత్ థియేటరులో "ఆర్యసమాజపు బోధయేమి" యను శీర్షికపై నుపన్యసించిరి. వేనవేలు జన సమూహముండెను.

బుధవారమునాటిరాత్రి దేవతామందిరములో "ధర్మలక్షణముల"గూర్చి యుపన్యసించిరి మందిరము జనులతో కిటకిటలాడిపోయెను. అందరు కడుసుత్సాహముతో వినిరి. గురువారమురోజు వారిక్కడికి దయచేసి వేటియుదయము నగరమునకు వెడలిపోయిరి. పోలీసువారు వీరిని పదేపదే విచారిస్తూ ఏకారణమువల్ల ఇక్కడికి దయచేసినారని ప్రశ్నించుచుండిరి.

## సనాతనమత ప్రచారకుని రాక

[స్వ. వి.]

మహబూబునగరం? అమర్దాదు ౨౭

మొన్న వేంకటశాస్త్రిగారు, సనాతనమతప్రతినిధిగా ఇచ్చటికివచ్చినారు. బాల్యవివాహముని షేధశాసనమునుగురించి ఏచట్టమేర్పడుచున్నదో అది యవసరములేదనియు దానిచే ఎన్నియో ఇబ్బందులు కల్గుచున్నవనియు ప్రచారముచేస్తు దానికి ఒప్పుకొనినవారితో సంతకములు తీసుకొనుచున్నారు. మిగుల ప్రయాసతో ఈగ్రామమంత గాలించి ఒకనంద సంతకములను తేగలిగినారు,

## ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథాలయస్థాపన

(ఒ. వి.)

తిమ్మాజీపేట, అమర్దాదు ౩౧

ఈగ్రామము మహబూబునగరము జిల్లాలో నాగరకర్నూలు తాలూకాలో చేరినది. ఇచ్చట మొదట మారుతీగ్రంథాలయమను పేరుతో ఇంతవరకుండెను. కాని అది చాలహీనస్థితిలోనుండెను. దానివలన లాభములేకపోయెను కావున మరల దానిని ఉద్ధరించవలెనను కోరికతో గ్రామప్రజలుమరల దానిని పునస్థాపనచేయించి కార్యదర్శిని ఎన్నుకొనిరి. ఏ, రాములుగుప్తగారు కార్యదర్శిగా పనిచేయుచున్నారు,

## ప్రకటింపబడని వ్రాతలు

ఈ క్రిందివిషయములనుగూర్చి మాకు వచ్చిన వ్రాతలను ప్రకటించజాలనందుకు విచారపడుచున్నాము:

౧ వరంగల్లుజిల్లా మధిరతాలూకా మునుపల్లి గ్రామములోను మెదకుజిల్లా సంగారెడ్డితాలూకా కంజర్లకలాన్‌జాగీర్ గ్రామములోనుహిందూ బాల్యవివాహనిషేధ నిరసనార్థము జరిగినసభల వృత్తాంతవివరణలు.

౨ ఆమాత్రగ్రామస్థుని పోలీసుద్యోగి పెట్టిన బాధ

౩ నిర్మల్ తాలూకాలో మండలాపురం జాగీరుగ్రామములో పోలీసుఉద్యోగి బెదరింపులు.

౪ ప్రధానోపాధ్యాయుని నిరంకుశత్వముఅని జనగామతాలూకాలోని దేవర ఉప్పలగ్రామమునుండి వచ్చినవార్త.

౫ సిద్దిపేట సనాతనధర్మ శాఖాసంఘప్రకటన.

## ప్రధానోపాధ్యాయుని వీడ్కోలు

(స్వ.వి.) మహబూబునగరం

అమర్దాదు ౨౯.

ఈజిల్లా ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీ వేంకటరావు మాన్వికర్ గారి తబాదిలా రాయచూరుకుచేయబడినది. వీరి స్థానములో శ్రీరామానుజాచారి గుల్బర్గానుండి వచ్చుచున్నారు. నిన్న సాయంత్రి ౫గంటలకు శ్రీవారి వీడ్కోలుసభ జరుపబడెను. ఈసభకు శ్రీ బరకత్ రాయ్ తాలుక్దారుగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. కొందరువిద్యార్థులు ఉర్దులోను. ఆంగ్లేయములోను ఉపన్యసిస్తు శ్రీవారుచేసిన అమోఘకార్యములను స్తుతిస్తు వారిఆయురారోగ్యమునుగూర్చి దేవుని ప్రార్థించిరి.

ఉపాధ్యాయుల దిక్కునుండి ఒక సన్మానపత్రము ఇవ్వబడెను. దీనిలో శ్రీవారు నాలుగు సంవత్సరములలోనే ప్రశంస్యులు కావటానికి కారణమేమన మెట్రిక్ పరీక్షలో (౯౫)ప సబడి (౭౪) ప్యాసుఅయిరి.

తర్వాత శ్రీవారుఉపన్యసిస్తు ఈరీతిగాచెప్పిరి. ఈ పాఠశాలకు ఇంతఉన్నతదశ రావటానికి కారణమేమన ఉపాధ్యాయులశ్రద్ధ విద్యార్థులకష్టము తానుమాత్రము ప్రతికార్యము నియమితకాలమునకు జరుగుచున్నదాలేదా అనివిచారించుచు కార్యముసాధించినారము. మొహదియార్జంగు బహద్దరుగారుసైతము పరిశీలించి ఈ పాఠశాల ఉన్నతస్థితినిగూర్చి వ్రాసినట్లు తెలిపిరి. పీటినన్నిటిని1శ్వసిస్తు వారిపనినిగూర్చి నాకే గర్వించుచున్నట్లు తెలిపిరి.

శ్రీ అధ్యక్షులవారుసైతము వీరిని ప్రశంసిస్తు ఈరీతిగాఉపన్యసించిరి. నా ప్రియస్నేహితుని వీడ్కోలుసభకు నేనే అధ్యక్షునిగా ఎన్నుకొనబడినందులకు విచారించుచున్నాను. ఇంతభక్తిశ్రద్ధలుగల విద్యార్థులను మాబోటి ప్రియ స్నేహితులను విడిచిపోవుచుండుట చూడ మనస్సునకు సంకటముగలుగుచున్నది, ఇది సర్కారువారి యాజ్ఞ -౦దరు శిరసావహించదగినవారే. కాన వీరీఅభివృద్దినిగూర్చి ఆయురారోగ్యమునుగూర్చి సంతానాభివృద్ధినిగూర్చి, ఇట్టి అమోఘమైనశ్రద్ధ, విద్యాసక్తిని గలిగియుండుటనుగూర్చి దేవుని ప్రార్థించుచున్నాననిరి.

## సనాతన ప్రచారము

కూలీలకు అల్లిబొల్లిమాటలుచెప్పి అంగుష్ఠముద్రలు ఒత్తించుకొనుట

(విలేఖరి)

దేవరుప్పుల, అమర్దాదు ౨౪

ఈగ్రామము జనగామతాలూకాలోనిది. ఈ గ్రామమునకు నాయకులగు రాపాక వెంకటరాంచంద్రారెడ్డిగారు దేశముఖులైయున్నారు. వారి ఇలాకా కొన్నిగ్రామములకు ఆంధ్రోద్యమవ్యాప్తికొరకు సభ్యులుగా చేరుటకై వారి స్వహస్తాక్షర విలేఖలను గ్రహించి తమజిల్లాప్రచారమునందు సానుభూతిచూపించుట ఆదర్శప్రాయమైయున్నది

౨౪ అమర్దాదునుండి ౨౮ అమర్దాదువరకు ప్రతిదినము జిల్లా ఆంధ్రసంఘమువల్ల ప్రజలకు గలిగే వివిధసౌకర్యములు, ఈ వరకు అలవడియున్న చెడుగులు, వాటి నివారణోపాయము మరియు ప్రభుభక్తి మొదలగు జిల్లా ఆంధ్రజనసంఘముల ప్రణాళికొనూత్రముల ననుసరించి జాతీయకీర్తనాప్రబోధము జరుగుచున్నది.

౩౦-౯-౪౯ నాడు నా అబ్బాయివివాహమునకు నాబంధువులు సనాతనధర్మప్రచారకులైవచ్చి ఉండిరి. నేనున్న బంగళా వెనుక రాసిపని, మట్టిపని చేసేవారిసంతకములు బాల్యవివాహానుకూలముగా పెట్టించుకొనుచుండిరి. ఇంతలో ఎవ్వరో బొంపెగొయ్య అగుడిసెలవారికి మిమ్ములను యుద్ధములో చేర్చుటకు సంతకాలు పెట్టించుకొనుచున్నారని ఛలోక్తివిసరగా తెల్లవారిప్రచారకులను గుడిసెలలోకి రానివ్వలేదని నాతో అప్రచారకులు చెప్పినారన్నవిషయము తెల్పబడినంతట అందరు అనుకూలముగా చేతులెత్తి శ్రీ కొండా వెంకటరంగారెడ్డి గారి తీర్మానమునే ఆమోదించి ఉన్నారు.

### శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయం

మీనవోలు,జులై ౪

మధిరతాలూకా మీనవోలు గ్రామములో ది ౬-౬-౪౦ వ తేదీన సదరు గ్రామస్థులచే శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయము నూతనముగా స్థాపింపబడినది గ్రామసౌభాగ్యానికి ఈ గ్రంథాలయము మిక్కిలి తోడ్పడగలదని ఆసిస్తున్నాము:

మాగ్రామములో సర్కారీ ఇందాదిపాఠశాలకు గ్రామపౌరులు అందాజా రు ౨౦౦-౦-౦లు పైగ వ్యయపర్చి నూతనముగా ఒకభవనమునూ నిర్మించినారు. ఈ పాఠశాలలో ౬౫ మంది విద్యార్థులుండి యున్నారు. ఒక్కఉపాధ్యాయుడుమాత్రమే పని చేయుచువున్నాడు. రెండవవుపాధ్యాయుని యేర్పాటుచేయుటకు మహాఘనత వహించిన శ్రీనిజాముప్రభువారివిద్యాశాఖ ధికార్లకు తెలియపర్చుకొని యున్నాము.

ఇట్లు
గ్రామపౌరులు.

### పశువులకు గడ్డికరువు

కామారెడ్డితాలూకాలోని బిక్కనూరు, రామేశ్వరపల్లి, సిద్ధాపురంవగైరా గ్రామాలలో ప్రజలకుతిండికిలేక పశువులకు గడ్డినీళ్లులేక, చాలా కష్టముకలుగుచున్నది యీగ్రామములు అడవిశాఖవారి మహసూరాలోనున్నవి. బీదరైతులకు చాలా ఇబ్బందులువున్నవి. కావునపశువులకు చిట్టీలులేకుండా అటవీశాఖవారు పశువులగడ్డిమేతకుగాను సెలవుఇచ్చిన చాలా అనుకూలముగా నుండును.

కలరా

బిక్కనూరు గ్రామములో కలరావ్యాపించి ఒక స్త్రీ మరణించెను. తర్వాత ౧౫రోజులకు బిక్కనూరు యీతేదీనములో ఒక్క కలాలివాను మ్యుడు కలరావలన మరణించెను, మళ్ళి రెండవదినము యీదులగీతగీచే గౌండ్లవారు నలుగురికి తగిలెను. అందులోఒకడు వూరిలోకి వచ్చి మరణించెను తక్కినముగ్గురు తమగ్రామము అనగా మత్యంపేటకు పోయి మరణించిరని వార్త తెలిసినది. యీదులగీచేవారందుకు కలరా వలన భీతి నొంది సొరిపోయెను. ఇప్పటికి కల్లసుకొనములు మూసికొన్నవి సర్కారీ వైద్యుడువచ్చి జనులకు టీకాలు వేసినారు.

కొందరు రైతులు.

## బిదరుఖూనీకేసు-కొట్టివేయబడినది

### నిందితుల నేరము రుజువుకాలేదు

"అయ్యో ఏపాపమెరుగని బస్వంతరావు చంపబడెనుకదా"

౩౧ అమర్దాదునాడు బిదరుకోర్టున్యాయాధికారి బస్వంతరావువకీలును అల్లరులసందర్భములో ముగ్గురు ముసల్మానులు చంపియుండిరను ఖూనీకేసు విచారణను పూర్తిగావిచారించి తీర్పుచెప్పినారు. ఆ తీర్పు యీవిధముగా నున్నదని ఆజంన్యూసువారు ఉర్దూపత్రికలలో ప్రకటించినారు.

"ఈదినము (౩౧ అమర్దాదు) గుల్బర్గా సెషన్ జడ్జియైన మౌల్వీ మిర్జాఅహమదు బేగుగారు బిదరులో ఫైకేసును విచారించిరి. బస్వంతరావు వకీలును ఖూనీచేసినారనిపట్టుకొనబడినలాలఖాఁ, షేకుఅహమ్మద్!యాఖూబ్ అనుముగ్గురు ముసల్మానులను నేరము రుజువుకాలేదని వదలిపెట్టెను. వదలిపెట్టుటయేల అనగా పోలీసువారు ఇప్పించిన నేరము జరుగుచుండగా కండ్లారచూచినవారి సాక్ష్యము ఒప్పుకొనతగినదికాదు. నిందితులు ఏపాపమెరుగనివారు. విజ్ఞులైన జడ్జిగారు తమతీర్పులో సాక్ష్యమునుగూర్చిన ఖానూనుసమస్య చర్చించిరి. మిసల్‌కట్టలో తూడ్పుసాక్ష్యమునుగూడ అటుంచి పోలీసుసాక్ష్యాన్ని మాత్రమే చూచినను నిందితులపై నేరము రుజువగుటలేదు. హింసోద్భవాభియోగములలో (ఫౌజ్దారీకేసులలో) ఒకసర్వసాధారణమగు నియమమేమనగా నేరమును సందేహములేనట్లుగా రుజువుపరుచునట్టి ఉత్తమసాక్ష్యము ఇప్పించవలసియుండును. అనుమానానికి కొంచెముకూడా అవకాశము లభించితే దానిలాభము నిందితులకు లభించును. జడ్జిగారు యింకా యీవిధముగా తీర్పులోవ్రాసిరి-- "నేరాన్ని చూచినవారి సాక్ష్యములో పరస్పర వ్యాఘాతాలుకలవు. వారు ఖూనీజరుగగ చూచికూడా ఉండవచ్చును. కాని యెవ్వరు ఖూనీచేసిరో వారిని సరిగా గుర్తుపట్టినారని చెప్పజాలము. ఇట్టి మతకలహాలలో ఒకపక్షంసాక్ష్యాన్ని కఠినంగాచూడవలసిఉంటుంది. అంటే ముసల్మానుకు వ్యతిరిక్తంగా హిందువులు సాక్ష్యమిస్తే, దానిని అబద్ధము అనవలెనని మేము చెప్పము. ఎందుకంటే ప్రతిమనిషీ అబద్ధికుడు కానేరడు. అయితే ప్రతిమనిషీకూడా సత్యముచెప్పడు. మాకు ఈసాక్షుల సాక్ష్యము అనుమానంగా ఉంది."

పండితులైన నాజింగారు ఇంకను ఈవిధముగా తీర్పువ్రాసిరి.

"అయ్యోపాపము! ఏపాపమెరుగని బస్వంతరావు చంపబడెను. అతడు ఒకవిధవను, మరియిద్దరు చిన్నపిల్లలను విడిచిపోయెను. అతన్నిచంపినవాడు దొరికితే వానికిబుద్ధివచ్చునట్టిశిక్షకు పాత్రుడౌతూఉండెను. కాని న్యాయాన్ని మేము వదలజాలము. విషయము ఎంతవిషాదకరమైనదైనను న్యాయస్థానము ఎట్టి నిరపరాధినికూడా శిక్షించజాలదు. అందుచేత మాఅభిప్రాయములో ఈకోర్టులోనున్న నిందితులపై ఖూనీకేసు రుజువుకాలేదు. అందుచేత ఆజ్ఞఇచ్చుట యేమనగా-- ఈకేసులో సాక్ష్యము రుజువుకానందున ముగ్గురునిందితులు విడుదలచేయబడుచున్నారు."

# ఓ ఏసుదేవా!

## హిట్లరును బెదిరించుమా!!

హైద్రాబాదు, ౧౦-౧౦-౪౯ ఫ.

హైద్రాబాదు మక్కా మసీదులో మొన్నటి శుక్రవారమునాడు నమాజు అయినతర్వాత హజరత్ మౌలానా మహమ్మద్ బాదుషాహుసేని సాహెబ్ ఖాదిరీ అనేవారు "వాజ్" ను పూర్తి చేసిన తర్వాత యీవిధముగా ఏసుక్రీస్తునుసంబోధించి ప్రార్థించిరి:—

"ఓ హజరత్ ఏసుదేవా, నీవైతేనీ అనుయాయులకు 'ఎవరైనను నిన్ను ఒకచెంపమీద వాయించితే రెండవచెంపనుకూడా అనుకూలపరచవలసింది' అని పాఠము పెట్టియుంటివికదా. కాని యీనాడు నీమతస్థులకు నీవుచెప్పిపోయిన పాఠము జ్ఞాపకము లేకపోయెను. వీరుకొన్నిదినాలే అధికారాలు చలాయించి సైతానుపరికరాలతో చిటికెలలోనే తమసోదరులనే మృత్యుగుండములో పడవేయుచున్నారు. అట్లుచేసి ఆనందించుచున్నారు. లక్షలపిల్లలు అనాథులై లబలబ కొట్టుకొనుచున్నారు. వేలస్త్రీలు నిరాధారలై హాహాకారాలుచేయుచున్నారు. నగరాలు, నగరాలే అడవులైపోవుచున్నవి. కరుణమాయమైనది. శాంతి ఛిద్రకలశమైపోయింది. మానవత్వము రక్తాశ్రువులను ప్రవహించుచున్నది. సముద్రములోగాని, భూమిపైనగాని, నగరాలలోగాని, మైదానాలలోగాని యెక్కడను క్షేమములేదు.

ఓ మెసయ్యా (యేసుక్రీస్తుయొక్క అపరనామము) దయచేయండి. మీమతస్థుల స్థితిని తిలకించండి. మీరు మీతర్వాత శాంతికలుగునని చెప్పియుంటిరి. మాపైగంబరుగారికాలములో ౧౦ ఏండ్లలో ౧౦ లక్షల చదరపు మైళ్లభూమిని ముసల్మానులు గెలిచిరి. ఆ ౧౦ ఏండ్లయుద్ధాలలో కేవలము౧౫౦ మంది శత్రువులనే హతిమార్చిరి. ముసల్మానులు ౧౨౦ మందిషహీదులైరి (మతానికి ప్రాణాలిచ్చి పవిత్రులైరి). ఎక్కడ ౧౦ ఏండ్లు ఎక్కడ ౧౫౦ చావులు. మరిఇప్పుడెక్కడ ఒక ఏడాదికాలములో ౭౦-౮౦ లక్షల చావులు. ఇదిఇష్టటికథ. మరిపైగా మేము ఏసుక్రీస్తు మతస్థులమని చెప్పుతుంటారు. మేమే మానవత్వము నిలబెట్టినామంటారు నాగరికతనునిలబెట్టినామంటారు. ఇతరుల కండ్లలోని నలుసు కనబడుతుంది వీరికి—కాని తమకండ్లలోని దూలము కానరాదు.

ఓ హజరత్ మెసయ్యా! మీమతస్థులలో ముఖ్యముగా మీగులాం అయిన హిట్లరును జాజ్వల్యమానుడైన అల్లాద్వారా బెదరించండి. ప్రాపంచికపు అశాదేవికి లక్షలజనులను బలియియ్యకుండాచేయండి. అనాథుల హాహాకారరాలను చూచి భయపడునట్లుచేయుండి. పరమాత్మ తన దివ్యశక్తి చూపించుగాత. ఇస్లామియా సల్తనత్ ఆసఫియాను దుర్మార్గులనుండి రక్షించుగాత."

# పోలీసువారు కేసును ఉపసంహరించుకున్నారు

బీదరులో పోలీసువారు భవానీసింగు, బాలారాం, అనువారిపై అబద్ధపువార్తలను, భయోత్పాతవిషయములను వ్యాపింపజేయుచున్నారను నేరము మోపి చాలానుచేసియుండిరి. నేరస్థాపనకూడా వినిపింపబడియుండెను. కాని పోలీసువారికేమి మనసువచ్చిందోయేమో తటాలున ౩౧ అమర్దాదునాడు "మేము మాచాలానును ఉపసంహరించుకొనుచున్నాము. నిందితుల వదలివేయవలసింది" అని కోర్టులో తెలుపుచున్నారు. కోర్టువారున్ను నిందితులను వదలివేసినారు.

# పేష్కారీ జాగీర్ల విచారణ

హైద్రాబాదు(దక్కను) షహరేవరు ౨

మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారి మరణానంతరము వారిసంస్థానముయొక్క వారసత్వ విచారణనుగురించి బాబెహుకూమతువారు ప్రత్యేక సమావేశముచేసి ౨౧ అమర్దాదు ౪౯ ఫ. నాడీ విధముగా ప్రకటనగానించిరి.

మహారాజాగారు చనిపోయినారు. వారిజాగీర్లయొక్కయు సుల్తానీమాషుయొక్కయు వారసత్వ విచారణ మ. ఘ. వ. నిజాంప్రభువుగారి ఫర్మానుప్రకారము బాబెహుకూమతులో ఈ క్రింది అధికారుల సమక్షమున కాగలదు.

౧. నాయబ్ సదర్ ఆజంగారు
౨. రెవిన్యూ మెంబరుగారు
౩. ఉన్నతన్యాయస్థానప్రధానన్యాయమూర్తిగారు

కావున మహారాజాగారి వారసులందరును నాలుగువారాలలో రుజువుకావలెను.

ము, జాతీయభావమేర్పరచి. ఈ ప్రభుత్వమును నిర్మూలింపజేయుటయని తోచిన ఇతర సంస్థలు ఏవైతే నల్లజండాలతో ఉన్నతాధికారులను సన్మానించునో "ముస్లిహాతు ముర్దాబాదు" యని కేకలువేయునో, ఏసంస్థనాయకులైతే ప్రభుత్వముతోను, అధికారులతోను, ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకుబదులు పత్రికా ప్రచారము వేదికల ఉపన్యాసముల మూలముగ సింహగర్జనలు చేయుచు, ఉత్తరువులు జారీచేయునో, అలాంటిసంస్థలవిషయమున ఏమిఅనవలయునో. ఈ సందర్భమున నిదర్శనమే అవసరమైన యిత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకుల వ్రాతలు, ఉపన్యాసములు లెక్కలేనన్ని లభించును. కాని పర్యవసానమేమాత్రములేనందున వదలుకొనుచున్నాను. "అధికారులతో మొరలు, ఉద్యోగులలంచగొండితనము గురించిన విజ్ఞప్తులు, కల్పితకల్పనలు, ఊహాప్రాథమికస్వత్వములకై, మతస్వాతంత్ర్యమునకై మొండిపట్టుదల. క్రొత్త క్రొత్త మత ఉత్సవాలు ఉరేగింపులలో ఉపేక్షాభావము రైతుఉద్ధరణమునకై చేయబడినచట్టములకు ఎదిరింపు ప్రతిఘటన, ద్రవ్యవంతులపక్షమున సహాయము, ఈవిధమైన నిర్మాణకార్యక్రమం ఆంధ్రోద్యమములోనున్నదని మస్తానీగారు వర్ణించినారు. వారుచేసిన వ్యాఖ్యానము సరియైనచో, సాధారణముగ ధారాలగురించికాని ప్రత్యేకముగ గూర్చిగాని పార్కుండేరుబావులీపన్నులతగ్గింపుకై కమాఫీచేయవలసినఅవసరముప్రభుత్వమునకుఏల కలిగెనో! న్యాయశాఖమంత్రియగు అనరబుల్ సయ్యదు అబ్దుల్ అజీజుగారు తమపదవి స్వీకరించుటతోనే లంచగొండితనమును నిర్మూలించుటలో నిమగ్నులుకావలసిన అవసరమెందుకు కలిగెనో; ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకులు, కార్యకర్తలు పన్నులు చెల్లించే రైతులు అయ్యియుండిన, వారు ధారాలు అత్యధికముగనున్నవి, లేనివి గ్రహించియుండెడివారు. వారికైతే అధికారవర్గముతో సంబంధమున్నది. వీరికి లంచిగొండితనమునేది ఎట్లు తెలియును, ఈ సంగతులు పల్లెటూళ్ళలోను, పూరిగుడిసెలలోనుఉండి దారిద్ర్యము ననుభవించుచు, పన్నుభారముచే కృంగిపోవుచు, జమాబందీవంటి బాధలకు సంకటములకు గురియగుచున్న బీద మహమ్మదీయులనే కనుగొనవలెను. ప్రాథమికస్వత్వములు, మతస్వాతంత్ర్యము ఉన్నదీలేనిదీ అధికారస్థానమందున్నవారికి ఏమితెలియును? ఇత్తెహాదుల్ ముస్లిమీన్ యొక్క నాయకులు, కార్యకర్తలు, ఆంధ్రమహాసభలు ఏకముగా అంగీకరింపబడిన తీర్మానములను తిరుగవేసిచూచియుండిన రైతుఉద్ధరణమునకై చేయబడినచట్టములను ప్రతిఘటించి, ద్రవ్యవంతులపక్షమున సహాయముచేసినది, లేనిది తెలిసికొనియుందురు. ఇంతేకాకుండ ఆంధ్రమహాసభలలో రైతుల ఉద్ధరణమునకై వారి అభివృద్ధిదాయకముగు ౧ ఋణదాతలచట్టము, ౨ ఋణపరిష్కారచట్టము, ౩. భూమ్యన్యాక్రాంత చట్టములుచేయుటకు అనేకసార్లు తీర్మానములు చేయబడినవి. ఇద్దరు గతమహాసభాధ్యక్షులు తమతమ అధ్యక్షత్వకాలమున శాసనసభలో ఈ చట్టములసంపర్కమున అలసటలేనిశ్రద్ధతో ప్రభుత్వముతో పనిచేసిరి. ఈసంగతులు దేశీయులు ఎరిగినవే. దీనితరువాతకూడ ఈలాటి అపవాదలు కల్పించిన, దీనికిసమాధానముకన్న ఊరకుండటమే మేలు. కాని నాసహచర్యులకు, మిత్రులకు, కార్యకర్తలకు నావిజ్ఞప్తి ఏమనగా, ఈలాటి వ్రాతలు, ఉపన్యాసములవల్ల ఆందోళన పడవలసినఅవసరములేదు. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకులు, కార్యకర్తల ఉపన్యాసములు, వ్రాతలను సర్టిఫికెటులు గాదింక, వాటిఆధారముపైన, ప్రభుత్వము మనఆంధ్రోద్యమును గురించికాని, లేక దీనికిసంబంధమున్న జిల్లాకమిటీలగురించి కాని తమపాలసీని నిర్ణయించుకొనునని తలపఅవసరములేదు. ప్రభుత్వము తమబాధ్యతలనుసరిగా గ్రహించును. మనపాలసీలోమార్పులేనిది ప్రభుత్వపుపాలసీ మార్పుకలుగజాలదు, మనఉద్యమము తాత్కాలికఉత్సాహ, ఆవేశముతో జన్మించినదికాదు. దీనికి కొంతచరిత్రముఉంది, కొన్ని సాంప్రదాయములున్నవి. ఇదిఇరువై సంవత్సరములలో క్రమేణ పరివర్తనము పొందినది. మనము మనపాలసీ ప్రకారమునడుచుచున్నవరకు ఏలాటి ఆటంకములు, అటంకములు కలుగజాలవని తలంచుచుమగించుచున్నాను.

మం. రామచంద్రరావు.

# హైద్రాబాదు రేడియోలు

హైదరాబాదు (దక్కను), షహరేవరు ౧

హైద్రాబాదు ప్రభుత్వమువారీ క్రిందివిధముగా హైద్రాబాదు సంరక్షక శాసనముక్రింద ఆజ్ఞాపించియున్నారు.

వైర్లెస్ రిసీవర్లను పబ్లికుకొరకుగాని లేక అట్టికొంతమందికిగాని ఉపయోగించునప్పుడును పబ్లికువారుకూడ వినుటకు అనువుగా నుండుస్థలము అందును రేడియోలలో శత్రుదేశాలనుండి లేక వారు ఆక్రమించిన దేశాలనుండి వచ్చువార్తలను విమర్శలను అందరును వినునట్లుగా పెట్టుకొనగూడదు.

# యుద్ధబాకీలు

హైద్రాబాదు (దక్కను), షహరేవరు ౧

యుద్ధానికై యియ్యబడు బాండులను హైద్రాబాదు పైనాన్సుకచ్చేరీలోని అధికారులు యథాశక్తి తీసుకొని పైకమిచ్చినారు. అందు ముఖ్యులు లియాఖతుల్లాఖానుగారు ౧౨౦౦ రూ. సీ. బీ. తారాపూర్వాలా ౧౦౦౦ రూ. సయ్యదుఉమర్, గుప్తా జవాహిర్ ఖాన్, సజ్జాదలీ, కరామల్లాఖాన్ హామిదలీగారలు చెరి ౩౦౦రూపాయిలున్ను, ౧౧ మంది చెరి ౧౦౦ రూ. ప్రకారమున్ను ౨౫ మంది చెరి ౫౦ రూ. ప్రకారమున్ను ౨౭ మంది చెరి ౨౦ రూ. ప్రకారమున్ను, ౨౫ మంది చెరి ౧౦ రూ. ప్రకారమున్ను తీసుకొన్నారు, అన్నియు కల్లారుపాయీలే.

# ఆంధ్రోద్యమమునకు భయములేదు

## ఆంధ్రోద్యమంపై నిర్హేతుక ఆక్షేపణలు

## ఇత్తెహాదుల్ ముసల్మీన్ నంఘమువారికి మహాసభాధ్యక్షుని సమాధానము

మహబూబునగరములో సమావేశమైన మెదకుసూబా యిత్తెహాదుల్ ముస్లిమీన్ మహాసభలో ఆంధ్రోద్యమమునుగురించి చాలా విమర్శలు చేయబడినవి. ఈసందర్భమున నేనేమియు తెలుపదలచుకొంటిని. కాని వివిధస్థలములనుండి నా సహచరులు, కార్యకర్తలు ఈ విషయమున మౌనము వహించక సమాధానము యివ్వవలెనని పట్టుపట్టిరి. ఈసందర్భమున అనేక లేఖలు నాకందెను. దీనివల్ల నాఅభిప్రాయములను వ్యక్తపరచవలసివచ్చెను.

అసలు విషయమేమనగా, యిత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘమునకును, దాని నాయకులకును, రాష్ట్రమున తమునకసంస్థతప్ప ఇతరులు ఎవ్వరును ఏ సంస్థలు స్థాపించుకొను హక్కులేదు. వారి అభిప్రాయముప్రకారము తమసంస్థ వకటే రాజ్యమునకును, రాజ్యాధిపతికిని, భక్తి విశ్వాసము గలది. మిగతసంస్థలన్నియు రాజద్రోహ పూరితమైనవి. ఈదృక్పథముతో ఇతరసంస్థలను పరిశీలించినవారికి ఎట్లునచ్చును: ఇదేహేతువున వారు అనుదినము రాష్ట్రములోని ఇతరసంస్థలకు వ్యతిరేకముగ ఉద్ఘోషించుచుంటారు. పూర్వపు స్టేటు కాంగ్రెసుపట్ల వారివైఖరి ఏవిధముగనుండెనో, మనకు తెలిసినదే: స్టేటుకాంగ్రెసు కార్యకర్తలు సదుద్దేశముతోను సామరస్యఅభిప్రాయముతోను, ఉన్నతాధికారుల సమాలోచనలతో, వీరిఅభిప్రాయానుసారము సంస్థపేరు మార్చడముతోనే యిత్తెహాదుల్ ముస్లమీన్ సంఘము నాయకులు ఎడతెగని ప్రతిఘటనచేసిరి. పూర్వపుపేరు మార్చినను, ప్రభుత్వము నూతనసంస్థను క్రమబద్ధమైనదని అంగీకరించనందున, ఇత్తెహాదుల్ ముస్లమీన్ వారి వాంఛితములు నెరవేరెను. వారియభీష్టములు ఈ విధముగ సఫలమగుటచే వారిదృష్టి ఇంకా ఇతరసంస్థలపైనప్రసరించుట స్వభావసిద్ధము. ఈవిధముగ వీరిదయాదృష్టి ఆంధ్రోద్యమముపైన పడుటలో ఆశ్చర్యములేదు. ఈఉద్యమము ఇరువైసంవత్సరములనుండి ఆయాకాలములలో మంచిచెడ్డల చవిజూచుచు, నిర్విఘ్నముగా సాగుచున్నది. కాని ఇంతవరకు దీనినడత వడుకుడుకులతో లేక చాలాజాగ్రతతోనున్నది: రాష్ట్రములోని వివిధ సంస్థలు మతపాక్షిక సంస్థలక్రింద చేర్చబడెను. ఇత్తెహాదుల్ ముస్లమీన్ సంస్థకూడ ఇందులో వకటి. కాని ఆంధ్రోద్యమము యొక్క ఆశయములు కార్యవిధానముచే ఇందులోచేర్ప వీలుకలుగకపోయెను.

ఇత్తెహాదుల్ ముస్లిమీన్ మహాసభాధ్యక్షులగు మౌల్వీఅబ్దుల్లాము స్వామీనాను తమ ఉపన్యాసములో, ఆంధ్రోద్యమముయొక్క కార్యవిధానమును. చాలావిచిత్రమైనధోరణిలో వర్ణించినారు. వాటిఅన్నిటికి జవాబుయిచ్చుటకై నేను సిద్ధపడజాలను. హేతువాదముతో యథార్థములను ఒప్పుకొనుటకు అంగీకరించిన సమాధానముకల్ల ప్రయోజనముకలగెడిది. పత్రికాప్రచారములో మరియుపన్యాసములతో ఆందోళనచేయుటకుమారుగ ప్రభుత్వాధికారులతో ప్రత్యక్ష సంబంధముతోను ఉత్తరప్రత్యుత్తరములతోను వ్యవహారములను పరిష్కరించుకొనే పద్ధతిని ఆంధ్రోద్యమ కార్యకర్తలు ఏర్పరచుకొనియుండిరి. ఇత్తెహాదుల్ ముస్లమీన్ నాయకులకు, ఈవిధాన

## ఆరోగ్యసంఘస్థాపన

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౩౦ నిన్నటిదినము పురపాలక సంఘమువారు సాయంకాలము ౫ గం. లకు ఆరోగ్యసంఘస్థాపనార్థమై సభసమావేశమయ్యెను. సభలో పెక్కుమంది యూనానీ వైద్యులు, డాక్టర్లు, నిజామియా ర్వేద, తిబ్బి విద్యార్థులు, తదితరులు నవాబ్ మెహిదినవాజ్‌జంగుగారిని అధ్యక్షతకై వరించిరి కాని నవాబుగారు పురపాలకసంఘ ఆరోగ్యాధికారియగు డాక్టర్ చీనాయిగారిని అధ్యక్షతకై సూచించిరి అందుపై సభ్యులందరి ఆమోదముతో చీనాయ్ గారు అధ్యక్షపీఠమలంకరించిరి.

డాక్టర్ అబ్దుల్ హైగారు గాలిపరిశుభ్రత విషయమునుగూర్చియు, డాక్టర్ ఖురేషీగారు నీటిపరిశుభ్రతనుగూర్చియు ఉపన్యసించిరి.

కార్యదర్శిగారు ఆరోగ్యసంఘనియమాలను ప్రవేశపెట్టిరి. జాతి మతభేదములతో నిమిత్తము లేక ప్రతివారును సంవత్సరమునకు ౪ అణాలు చందాచెల్లించి ఈ సంఘకార్యాలయము ఆది, బుధవారాలలో సాయంకాలము ౫ గంటల నుండి ౭ గం. ల వరకు తెరచియుండుననిరి.

అధ్యక్షులవారికిని పురపాలక సంఘపు నాజెంగారికిని కృతజ్ఞతార్పణలో సభముగిసెను.

### పండిత కచ్రూగారు

హైద్రాబాదు (దక్కన్) షహరేవరు ౨ పండిత కచ్రూగారు బహద్దరుయార్జంగుగారితో ౨-౧౦-౪౯ నాడు కలిసి ఒకగంటసేపు మాట్లాడినారట. మరల రెండుమూడు దినాలకు కలియుదురట.

### సికింద్రాబాదులో ఒక ధర్మదాత నిర్యాణము

ది ౫-౭-౧౯౪౦ శుక్రవారం ఉదయం ౭.౧౫ గంటలకు సికింద్రాబాదు వాస్తవ్యులును, కోస్తా వ్యాపారస్థులును, యాదవవంశ సంభూతులును నగు శ్రీయుత నాగెల్లి దుర్గయ్యగారి తండ్రిగారైన నాగెల్లి వెంకయ్యగారు సుమారు ౭౫ సంవత్సరముల ప్రాయమున కింగ్సువే రోడులో తమ స్వగృహమునందు కాలధర్మము నొందిరి. వారిమరణమునకు పావనవీధి ఆర్యసమాజమువారు ఆదేదినము శ్రీ వినాయకరావుగారి వ్యాఖ్యానము జరిపినసభయందు నాగెల్లి వెంకయ్యగారి ఆత్మకు శాంతిని ప్రసాదించగలందులకై ఈశ్వరుని ప్రార్థించుచు వారి కుటుంబమునకును, బంధుమిత్రాదులకును సానుభూతిని ప్రకటించిరి.

సికింద్రాబాదు } ఇట్లు
పావనవీధి } ఆర్యసమాజము మంత్రి

## హరికేన్ ఫండ్

హైద్రాబాదు(దక్కన్) షహరేవరు ౧ హైదరాబాదు నగరాల జనులు చందాలను ఇంపీరియల్ లేక సెంట్రల్ బ్యాంకులలోను పైనాన్సు కచ్చేరీలోను లేక రెసిడెన్సీలోను దాఖల్ చేయవచ్చును.

గౌ॥ సర్ థియోడోర్ టాస్కరుగారు పై ఫండుకు ౭౫౦ కల్దారున్ను న॥ మొహియుద్దీన్ యార్జంగ్ బహదర్ గారు ౫౦ కల్దారులున్ను చందాలు ఇచ్చినారు?

### యువరాజుగారి ఆగమనము

హైద్రాబాదు(దక్కన్) షహరేవరు ౨ యువరాజా ఆజంజా బహదరుగారు తమ పుత్రులగు ముక్రంజా బహదర్, ముఫఖంజా బహదర్ గారలతో కలిసి ౧౩౪౯ ఫ. షహరేవరు ౫ వ తేది గురువారము నాడు బెంగుళూరునుండి కాచిగూడెం స్టేషనులో సాయంత్రము ౭½ గంటలకు చేరగలరని తెలియుచున్నది.

## నిగారు మాసపత్రికనుగూర్చి ఆందోళన

హైద్రాబాదు(దక్కన్)షహరేవరు ౨ నిగారు మాసపత్రికను నిజాము రాష్ట్రములో రానీయకుండుటకై కోరుచు చాలమంది మహమ్మదీయులు సంతకములు చేసిన ఒక విజ్ఞప్తి పత్రము "దక్కన్ న్యూసు" వార్తాసంస్థకు చేరినది.

నిగార్ మాసపత్రిక విషయమిపుడు ప్రభుత్వము ఆలోచనలో నున్నట్లు తెలియుచున్నది.

# కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు

## మహాత్మా గాంధీగారి వ్యాసము

హరిజనపత్రికలో ౭ జూలై నాడు మహాత్మా గాంధీగారిట్లు వ్రాసినారు:

హెచ్. ఇ. వైస్రాయిగారు మరల పార్టీల నాయకులతో ఆలోచనలు చేయుచున్నారు. నన్నుకూడా పిలిచినారు. కాని పార్టీలీడరువలె కాని తుదకు నాయకునివలెకాని నన్ను పిలువలేదు. ఒకస్నేహితునివలె నన్ను పిలిచినారు. కాంగ్రెసువారి అభిప్రాయాలేమో తెలుసుకొనుటకై వారు పిలిచినారు, ఇప్పుడు జరిగేవిషయాలు మెరపు మెరిసినట్లుగా మహావేగముగా సంభవించనున్నవి. అందుచేత వాటివిషయము వెంటనే నిర్ణయానికి రావలెను ఈవాక్యాలు వ్రాసేలోపలనే నిర్ణయముకూడా కావచ్చును.

ఎవరైనాకాని ఆలోచించవలసిన వాటిలో మొట్టమొదటిది హిందూదేశానికి డుమినియన్ అధికారమిస్తే అంగీకారమేనా అనేసంగతి. ఇంతవరకే ఈసంగతి పూర్వకాలముమాట కాకపోతే యుద్ధము ముగిసినతర్వాతనైనా అట్టిది గనేఆగును. ఈ కొన్నిశతాబ్దాలనుండి బ్రిటను ఏవిధంగాఉండిందో ఇకముందుకు బ్రిటను యుద్ధములో గెలిచినాగాని ఓడినాగాని అదేవిధంగా ఎప్పటికినీ ఉండనేరదు. ఇంతమాత్రము నిజము, బ్రిటను ఓడిపోవలసియేవచ్చిన ఆఓటమి చాలా తేజోయుక్తమైనదిగానుండును. అది ఓడిపోతే, దానిస్థానములో ఉండెడుఏరాజ్యముకూడా దానిని తప్పించుకొనలేనిదగుటచేత ఓడినదని అనుకొనవలెను అదిగెలిచినటులైతే ఈపై మాటను నేనుఅనలేను, ఎందుకంటే నిరంకుశుల రాజ్యాలు ఏపద్ధతుల అవలంబించినవో వాటిని ఇంకా యెక్కువగా బ్రిటను అవలంబించితే దానికి జయము కలుగుతుంది. బ్రిటన్ పక్షంగా జయాన్ని లభింపజేసేందుకు కాంగ్రెసువారి నైతికసహాయాన్ని బ్రిటన్ వారు నిరాకరించిరని చాలావిషాదముతో చెప్పవలసివచ్చినది. బ్రిటను రాజనీతిజ్ఞులు ఈనైతికబలాన్ని అంగీకరించకపోవుట వారికిష్టమగుకాదు వారికి దాని అవసరము కనబడలేదు. కాంగ్రెసులో నైతికబలమున్నదని నేనన్నప్పటికిని వారికది కాకపోయియుండవచ్చును. కారణమేమైనాసరే హిందూదేశముయొక్క ముఖ్యాదర్శము కట్టులేని స్వాతంత్ర్యముగానుండి తీరవలెను. సాధ్యమైతే ఇంకెవరైనాసరే తనదేశానికి స్వాతంత్ర్యముకన్న తక్కువదర్జానుకోరరు, ఈ స్వాతంత్ర్యము ఏదేశమందుగాని జనులు పోరాడనిది లభించలేదు. ఏదియెట్లైనా కాంగ్రెసుఎన్నడో తనమనస్సు దృఢపరచుకొన్నది. బ్రిటనుకు ఏవైన బలీయమైన సహాయము ఇండియా చేయగలిగితే అట్టిసహాయము స్వతంత్ర భారతదేశమునుండియే లభించగలదు. పూర్వమువలెనే కోట్లద్రవ్యము ఇండియానుండి చెల్లించుకొని పోవచ్చును. ఈ దేశములోని కోట్లజనసంఖ్యలో వేనవేలమందిని సిపాయీలుగానో యుద్ధనౌకరులుగానో కూలీయిచ్చి తీసికొనిపోవచ్చును. అట్టిసహాయమంతయు దిక్కులేని ఇండియాపక్షాన జరుగును కాని దానివలన బ్రిటనుకు నైతికాధిక్యము కలుగనేరదు:

ఇక ఆలోచించదగిన రెండవయంశమేమనగా— అది దేశములో కల్లోలము లేర్పడవచ్చును. లేదా బయటినుండి దండయాత్రలు కలుగవచ్చును. అనునంశములు ప్రైవేటుసైన్యాలను సిద్ధముచేయుట వట్టి వ్యర్థమువని. దానికి సెలవుకూడ ఎన్నటికిని దొరకదు. విదేశీకాని స్వదేశీకాని అయినట్టి ఏరాజ్యముకాని ప్రైవేటు సైన్యాలను సహించదు. ఎవ్వరైతే ఇండియాలో ఆయుధసైన్యాలుండవలెనని విశ్వసింతురో వారు కొంతకాలము లోపలనే బ్రిటిషువారి జండాక్రింద సిపాయీలుగా చేరిపోదురు. ఈవిషయములో కాంగ్రెసుకార్యసంఘమువారు నిర్ణయానికివచ్చినారు. అతీర్మానమే గట్టిగా స్థిరపడినచో ఇంతలో కాంగ్రెసువారు జనులకు సైన్యాలలో చేరవలెనని ఉద్బోధన చేయవలసియుండును. అనగా తక్షణ స్వాతంత్ర్యమును కేకలను, నిజమైన అహింసను స్వస్తివాక్యాలు చెప్పినారన్నమాట, పైవివరించిన కార్యాలలో ఏరెంటికినిగాని (దేశరక్షణ, దండయాత్ర ప్రతిఘటన) కాంగ్రెసువారు ఆయుధాల యుపయోగాన్ని సమర్థించరని నేను ఇండియాకే గాక బ్రిటనుయొక్కయు ప్రపంచముయొక్కయు భావ్యభివృద్ధికొరకై అభిప్రాయపడుచున్నాను. మానవజాతియొక్క భావ్యభివృద్ధి కాంగ్రెసు చేతులలోనే యున్నదని నేను గట్టిగా నమ్ముచున్నాను. సరియైనమార్గములో నడుచుటకై కాంగ్రెసువారికి దైవము తెలివిని శక్తిని ప్రసాదించుగాక!

వైస్రాయిగారి కార్యనిర్వాహకసభను విస్తరింపవలెనను సూచన చాలా ప్రచారములోనికివచ్చినది ఎంతవరకు స్వతంత్ర అహింసను పాలింతురో ఆంతవరకు కాంగ్రెసువారు దానిదిక్కు చూడనొల్లరు. కాని అదిబాటతప్పితే స్వతః మూల రాష్ట్రములలో మంత్రాంగాలను ఏర్పాటుచేసుకుంటుంది, అట్లుచేసిన యుద్ధయంత్రాన్ని నడుపుటలో కాంగ్రెసుముఖ్యాంగముగానుండును బ్రిటనును రక్షించుటకుగాను ఇండియాను సిద్ధంచేసేపనితప్ప వేరేపని ఇండియా ప్రభుత్వానికిలేదు. ఇండియాను ఆత్మరక్షణకై సిద్ధము చేయుచున్నామన్నమాట వట్టి భ్రమ, ప్రపంచములోని రాజ్యాలకు ఇండియాదేశము బ్రిటనువారికి ఆస్తిఅన్నభావముతప్ప వేరేభావములేదు. అందుచేతఇది అత్యంతలోభనీయమైనట్టిది. బ్రిటిషుకిరీటములో ఇండియా అత్యంతోజ్వలమైన వజ్రముకాదా? ఇండియాయుద్ధవ్యాపారమును నేర్చుకొనదలచినచో ఇప్పుడది బ్రిటిషు యజమానులు సెలవిచ్చినంతమేరవరకు ప్రాథమిక పాఠాలను నేర్చుకొనవచ్చునన్న సంగతిని నేనొప్పుకుంటాను.

కాంగ్రెసువారు తమనిర్ణయమేదో నిష్కర్షచేసుకొనవలెను. వారికిచూపింపబడుఆశ అప్రతిఘటనీయమైనదిగానున్నది. కాంగ్రెసువారు మంత్రులుగాను రాజ్యాంగనిర్వహణ కర్తలుగాను నుండవచ్చును. వారికి యుద్ధయంత్రరహస్యాలు కూడా కొన్ని తెలియరాగలవు. ఇంగ్లీషువారు చేయుచున్న యుద్ధపద్ధతిని వారు సెలవిచ్చినంతవరకు కాంగ్రెసుమంత్రులు తెలుసుకొనుచుండగలరు. కోట్లకొలది ద్రవ్యాన్ని వసూలుచేసి దానిని వారు యుద్ధప్రయత్నముకై ఖర్చుచేయవలసియుండును. ఎవరికైతే దానియందు విశ్వాసమున్నదో అట్టివారికి అవకాశమిచ్చి కాంగ్రెసువారు ఈ ఆశలను నిరోధించుకొందురని కోరుచున్నాను. ముసల్మానులు, హిందువులు, సిక్కులు, పార్సీలు, క్రైస్తవులు ఇదివరలో చేసినట్లుగా ఇప్పుడును ఎంతోమంది ఈయుద్యోగాలను స్వీకరించేదానికి సిద్ధముగానుందురు. వారును మనదేశీయులే. వారికిని సద్భావమున్నదని మనమంగీకరించవలెను. కాని స్వాతంత్ర్యమందలి విశ్వాసముకలవారు తమ అదర్శాన్ని వదలుకొనకుందురుగాక. కాంగ్రెసువారు ఈకల్లోలాలలోదిగినవారు గొప్పప్రమాదములో పడినవారగుదురు. వారిపోరాటము నిజమైన అహింసతోకూడినదై యుద్ధముముగిసే లోపల వారు స్వరాజ్యమును సాధించినవారగుదురు.

## మొత్తము ఫ్రెంచి సామ్రాజ్య వైశాల్యము

మొత్తముపై ఫ్రెంచిదేశమునకు లోబడిన దేశాల వైశాల్యము ౪౭ లక్షల ౧౩ వేల ౫౩౪ చదరపు మైళ్లు ఈదేశాలలోని జనసంఖ్య ౬ కోట్ల ౪౯ లక్షల చిల్లర.

## తూర్పు ఏజన్సీ సంస్థానాధిపతుల సభ

తూర్పుఏజన్సీ సంస్థానాధిపతుల రెండవ సభ నేడు కలకత్తాలో త్రిపురా భవనములో త్రిపుర మహారాజుగారి అధ్యక్షత క్రింద జరిగెను. సభకు ౧౪గురు సంస్థానాధిపతులును, ౨౫మందిదివానులును వచ్చిరి, దేశరక్షణములో ౧౦౦కి ౩ వంతున వడ్డీగలపత్రాలను కొనుటకు లక్ష రూపాయీలను వ్యయపరచవలెనని సభవారు నిశ్చయించిరి. "బ్రిటనుకు ఇండియాకు ఒక్కటేగతి కలుగును. గనుక భారతీయులందరూ యిప్పుడు బ్రిటనుకు శక్తివంచనలేకుండ సహాయము చేయవలెను. అను తీర్మానము వ మోదించిరి.

సంస్థానాలలో శాంతినినెలకొల్పుటకు కావలసిన యేర్పాటులనన్నిటినీ చేయుటకు సౌకర్యములను వైస్రాయిగారు సమకూర్చవలెను ఆయుధములు మందుగుండు మొదలగువాటిని సప్లయి చేయవలెను, ప్రజకకు శిక్షణనొసగువారిని పంపవలెను" అను తీర్మానముకూడ ఆమోదింపబడెను.

యుద్ధనిధులకు ఘనసహాయమును చేయవలెనను తీర్మానముకూడ ఆమోదించబడినది.

ఇండియా ప్రభుత్వమువారికి సంస్థానాధిపతులు యుద్ధవిషయములో అత్యధికమైన సహాయముచేయుటకు సంస్థానాధిపతుల స్థాయిసంఘ సభ్యులును, మంత్రుల సంఘమువారును కలిసి ఒక సంఘముగా యేర్పడవలెను" అను తీర్మానముకూడ ఆమోదించబడినది.

## భారతీయ సైనికాధికారుల సంఖ్య హెచ్చింపున కవకాశము

సిమ్లా, జూలై ౮

ఇండియా సైన్యములో భారతీయమయ మొనరింపబడిన యూనిట్లలో మాత్రమే అధికారపదవులు పొందుటకు భారతీయులకు హక్కుండునని పూర్వము చేసిననిర్ణయమును ప్రభుత్వమువారు మార్చుకొనుటవల్ల, భారతీయ సైనికాధికారుల సంఖ్య సుమారు ఇరువదింతలు హెచ్చుగలదని తెలియుచున్నది. ఈఅధికార స్థానములకర్హత కలుగచేయుటకై యుద్ధారంభమునకు పూర్వము ప్రతిసంవత్సరము ౫౧ మందికి మాత్రమే శిక్షణ ఇచ్చెడివారు. ౧౯౪౧వ సంవత్సరము మొదలు ప్రతిఏట ఇంతకు ఇరువదియిరెట్లు అనగా ౧౧౦౦ మందికి శిక్షణఇచ్చెదరు. ఇంతవరకు ఎమర్జెన్సీ కమిషనులు, అనగా యుద్ధము ముగియువరకు మాత్రమే అమలులోనుండు అధికారస్థానములు పొందుటకు ౨½ సంవత్సరములు శిక్షణపొందవలసియుండెను ఇకనుండి ౧౮ నెలలలో శిక్షణ పొందినచాలును. కనుకపైనచెప్పిన ౧౧౦౦ మందిలో చాలామందిని డేరాడూను ఇండియను మిలిటరీ అకాడామి తయారుచేయకలిగియుండును. అవిగాక వేరొక శిక్షణకేంద్రమునుగూడ క్రొత్తగా ఏర్పరుచుచున్నారు.

ఒక్కొక్కమారు ౫౦౦ మంది చొప్పున ప్రవేశపెట్టుకొని క్రొత్తశిక్షణకేంద్రము ౬ నెలల పాటు శిక్షణయొసగును. మొట్టమొదట అనగా ఈ ఆగస్టునెలలో ౧౦౦ మందిని మాత్రమే చేర్చుకొందురు. క్రమముగా కొద్దినెలలో ౫౦౦ సంఖ్య పూర్తిచేయుదురు. ఆతరువాత ప్రతిసారి ౫౦౦ మందిని తీసికొనుచుందురు. ఆరునెలలు శిక్షణమంది ఒకజట్టు వెళ్లిపోగానే క్రొత్తజట్టును స్వీకరింతురు.

యుద్ధము ప్రారంభమైనతర్వాత భారతీయ సైనికాధికారులు నిండుజీతపుహోదాకుతీసుకొనిరాబడినవారు ౩౮౧ మంది వీరిలో ౧౫౨ మంది మిలిటరీ అకాడామీలో శిక్షణపొందినవారు. ౧౧౦ మంది ఇతరచోట్లనుండి వచ్చినవారు ౧౨౮ మంది టెరిటోరియల్ సైన్యములో సీనియరు గ్రేడు ఆఫీసర్లలోనుండి ఏరుకొనబడినవారు, సైనికాధికారస్థానాలకు శిక్షణమందుచున్న భారతీయులు ౧౩౬ మంది

౭౦ విమాన సైనికాధికార పదవులకుగూడ ఈక్రొత్తకేంద్రములోనే శిక్షణఇచ్చెదరు.

మిలిటరీ అకాడమీలోకన్న క్రొత్తశిక్షణ కేంద్రములో శిక్షణకాలము తక్కువగానుండుటకు కారణమున్నది. ౧౮ నుండి ౨౦ ఏండ్లలోపువయస్సుగలవారిని మిలటిరీ అకాడమీ చేర్చుకొనుచున్నవి. క్రొత్తశిక్షణకేంద్రము ౨౧ నుండి ౩౦ లోపు వయస్సువారిని చేర్చుకొనుచున్నది. వీరికి వయస్సు పెద్దఅగుటచేత వీరుబాగుగా విద్యనేర్చినవారుగ నుందురు. వీరికి శిక్షణసమయమున సామాన్యకళాశాలలో నేర్పువిషయములను బోధించవలసిన అవసరముండదు. కనుక శిక్షణకాలముదీర్ఘముగా నుండవలసిన అవసరము లేదు.

## కలకత్తాలో తాటిప్రమాణ పాదపు మనుషులు

కలకత్తాలో ఈమధ్య ఒకవిచిత్రం జరిగింది. సుమారు ౧౨దినాలక్రిందట ఒకయువకుడు రాత్రినిద్రపోతూ ఉండగా తనగదిలో నప్పుడైంది. కండ్లు తెరిచిచూచేవరకు ఇంటిమిద్దెకుఅంటే నఖలగల తాటిప్రమాణంతమనిషి కనబడినాడు. ఇదేమిరా అనిగడగడవణకుచు పడకనుండిక్రిందికిగభీలున దొర్లి యొట్లోతలుపుతెరచుకొని వెనుక్కుచూడకుండా యిల్లువిడిచి ఒకేపరుగున ఊరికి సమీపంలో ఒకస్నేహితునియిల్లుదూరి మిగతరాత్రిని గడిపినాడు. తెల్లవారినతర్వాత తనగదికివచ్చి చూచుకొనేవరకు ౨౨అంగుళములపొడవుగల ఆరికాళ్ల జాడలు భూమిపై బాగాముద్రవేసినట్లు కనబడినవి. ఊరంతాఉడికిపోయింది. పోలీసువారు గదికితాళంవేసినారు కిటికీసందులగుండా వేలమంది జాతరకుపోయినట్లు పోయి చూచి వచ్చినారు.

ఇదియిట్లుండ ఆరోజే కలకత్తానగరంలో మరొకవింతజరిగింది. పైవిషయంలో రాత్రి కనబడినమనిషి ఒక్కనికేకనబడినాడు. కాలిజాడలు మాత్రము తానువచ్చిపోయినట్టి సాక్ష్యానికి గుర్తుకట్టిపోయినాడు. మరియిటీవల త్రిపురామహారాజువద్ద ఒక ౯౦గరక్షకసిపాయి ఉన్నాడట, అతడు ౭ అడుగుల ౬అంగుళాలపొడవున్నాడు, అతడువిలాసానికి వీధులలో తిరుగుతూఉండినాడు. జనులుఅతనిని చూచి ... ఆ భారీ ... బుద్ధిచెప్పినాడు. వీడెరా ఆనాటిరాత్రి పిల్లకాయునిగదిలో పోయినరాక్షసుడుఅని జనులుగుంపుకూడి రాళ్లుకర్రలు లాఠీలు తీసికొని వెంటబడినారు, వీధులలో అతనువాడు లేకుయిండ్లలో కెక్కడనకూడ ... అని భయోత్పాతముచే కిటికీలు తలుపులు మూసుకొన్నారు. వాని అదృష్టముకొద్ది బౌబజారు పోలీసు స్టేషన్ అక్కడనే ఉండింది గభాలున దాంట్లోకి దూరి తాను త్రిపురారాజాగారి మనిషినని తాను నిర్దోషినని చెప్పుకొని శరణుజొచ్చినాడు.



నిజాంరాష్ట్రి

## ఆంధ్ర ఆయుర్వేద కళాశాల

వైద్యవిద్య అంతయు తెనుగులో ఉచితముగా బోధింతురు

ఆయుర్వేదమును ఆంధ్రమునందే బోధించగల కళాశాల నైజామురాష్ట్రమునకిది యొకటియే. నిఖిలభారత ఆయుర్వేద మహామండలివారి విద్యాపీఠ ప్రణాళిక ననుసరించి ఈ కళాశాలయందు పాఠ్యక్రమము నడిపింపబడుచున్నది. మహామండలివారు నిజాంరాష్ట్రమున యీకళాశాలకు కేంద్ర మిచ్చియున్నారు. గతరెండుసంవత్సరములనుండియు విద్యార్థులు తమతమ పరీక్షా సమయములందు తృప్తికరముగు ఉత్తీర్ణతను చెందియున్నారు. సమర్థులగు పండితులచే కళాశాల నిర్వహింపబడుచున్నది.

విద్యావిధానమంతయు తెనుగునందే చదివించుటయు బోధించుటయు జరుగుచుండుటచేమాతృభాషయందు ఆయుర్వేదవిజ్ఞానమును సంపాదింపగోరు విద్యార్థులకిది అమూల్యమగు అవకాశము. వేసంగిశెలవుల అనంతరం జూన్ అఖరువారమునుండి కళాశాల బ్రహ్మసమాజ మందిరమున తిరిగి ప్రారంభించబడినది. నూతనవిద్యార్థులు చేరుటకు జూలై యిరువైతేదీ వరకు అవకాశమొసంగనైనది. ఆంధ్ర ఆయుర్వేద విద్యార్థులు యీ అవకాశమును పొందుటకై ఉపయోగించుకొనవలెను. దరఖాస్తులు ఉత్తరములు ప్రధానోపాధ్యాయులపేర క్రిందిచిరునామాకు పంపవలయును.

పండిత రామానుజస్వామి
౧౪౦ సుల్తాన్‌బజారు
హైదరాబాదు దక్కన్

## నైజాము ప్రజలకు హెచ్చరిక

నైజామునకును, బ్రిటిషునకును వీ.పి. పద్ధతిలేకపోవుటచే మా అనుభూతమందులను, యితరమందులను గ్రంథములను తెప్పించుకొనుటకు యిబ్బందిపడుచూ అనేకమంది కోరుటచే యీక్రిందివారిని నైజాములో మాస్టాకిస్టులుగా యేర్పాటుచేసితిమి కావున నైజాముప్రజలకు యీవిషయము తెలియపర్చడమయినది,

స్టాకిస్టులు:—మధిర డాక్టరు రామగోవిందం.
„ ఖమ్మంమెట్టు:-బొమ్మిడి రామకృష్ణయ్య సన్సు.
„ వరంగల్లు:-రవ్వాలింగయ్యగారు, లేక కుమారా ప్రింటింగ్ వర్క్సు.
„ శికింద్రాబాదు:-మూల్‌చంద్ అండ్‌కో, స్టేషన్‌రోడ్.
„ హైదరాబాదు:-కింగ్ అండ్‌కో.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౪-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular
That reaches
The masses
In the Dominions
Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn.** **Thursday 11 July 1940** *Number* **20**


## తుర్కీపై జర్మను ఆరోపణ

(మొదటిపేజీ తరువాయి)

జరుగరాదని నిర్ణయించిన హద్దులోనిదగుటచే. అమెరికా ప్రభుత్వమువారు బ్రిటిషువారిచే ఈ దీవిముట్టడి యుద్ధచర్యచేబట్టి అముట్టడి ఇకఏంత మాత్రము జరుగుటతగదని తలచుచున్నట్లును ఒక వార్త ఈ అమెరికా వైపునుండివచ్చినది. కొన్ని అమెరికాయుద్ధపు ఓడలు మార్టినిక్ దీవికిదూరముగాకాచుకొని పరిశీలన చేయుచున్నను. కాని బ్రిటిషువారు అట్టిముట్టడి జరుగుచుండుటలేదనుచున్నారు. కాని బ్రిటిషుఓడలను, నార్వే ఓడలను ఫ్రెంచివారి ఖస్టింశీసు దీవులకు పోవలదని అజ్ఞాపించినారు,

### జర్మనీ క్రిందనున్న ఫ్రాన్సుభాగము

జర్మనీ ఆక్రమించియున్న ఫ్రాన్సుదేశభాగమంతయూ జర్మను సైనికావసరములకై పిండివేయబడుచున్నది. అభాగమందలి అహారపదార్థములు, ఇతర పదార్థములు మొదట జర్మను సేనలకు సరలుపెంచక పంపవలెనని అజ్ఞయైనది.మరియు ఈభాగములోనికి ఇతర ప్రదేశమునుండి వార్తాపత్రికలు రాకూడదని అజ్ఞచేయబడినది. ఫ్రెంచివారి నాణ్యెమగు ఫ్రాంకుకు ఇంతవరకు బ్రిటిషువారి పౌనుతోనున్న సంబంధము తొలగించి, ఇపుడు అమెరికావారి డాలరుతో పెట్టబడినది.

## బెర్లినుకు హిట్లరుగారి విజయము

ఇంతవరకు జనరల్ హెడ్ క్వార్టరు లోనుండి పశ్చిమరంగయుద్ధకార్యమునంతయు నడిపించి, హిట్లరుగారువిజయముతో జర్మనీప్రధాన నగరమగు బెర్లినుకు జూలై ౬వ తేదినాటి మధ్యాహ్నము ప్రవేశించినపుడు, జర్మనులు"మేముఇంగ్లాండుపై దాడి జడలెద"మను ఘోషలతో స్వాగతమొసగిరి.

హిట్లరుగారు బెర్లినుచేరినమరునాడే ఇటలీ విదేశాంగమంత్రి కౌంట్ సియానోగారు బెర్లినుకు ఉదయమువచ్చి హిట్లరు,వాన్‌రిబ్బన్‌ట్రాఫ్,జర్మనీలోని ఇటలీరాయబారి, ఇటలీలోనిజర్మనురాయబారులతో కలిసి ఏవోఆలోచనలను రెండుగంటలకాలముచేసి, తర్వాతఅనాటిసాయంకాలమే పశ్చిమరంగమంతయుచూడబోయిరి

సియానోగారు హిట్లరుగారితో ఏమిచర్చించిరనువిషయమున అనేకులుఅనేకములైన ఊహలు చేయుచున్నారు. బ్రిటనుపై జర్మనుదాడిచేస్తెను సాగింమట, ఐర్లెండుమీనుగా సాగించవచ్చునా' యూరపుఖండమంతటివిధానములను ఉమ్మడిగా వ్యవహరించుటెట్లు, రష్యాసేనలుపశ్చిమమునకు అక్రమించుకొనుచున్నందువలన బాల్కనుపాంత్రపుగతి, ముందుయూరపులో శాంతిస్థాపనయెట్లు —అను నీప్రశ్నలు చర్చలోకివచ్చినట్లుచెప్పుకొనుచున్నారు.

సియానోగారు వాన్‌రిబ్బన్‌ట్రాఫ్‌గారితో కలసి రష్యాదేశప్రధాననగరమగు మాస్కోకుపోయెదరని ఒకవదంతియున్నది.దీనిఉద్దేశ్యమేమో. రష్యావారితోకూడ ముందుకర్తవ్యములగు ఆలోచనలు జరిగేటట్లుకనబడుచున్నది.

## బాల్కన్, బాల్టికు రాజ్యాలు

యుగోస్లావేకియా, రుమేనియా, బల్గేరియా, గ్రీసు,అల్బేనియా;తుర్కీ — బాల్కనురాజ్యములనియు, లిథుయేనియా, లట్వియా, ఎస్తోనియా, ఫిన్‌లెండు—ఇవి బాల్టిక్ రాజ్యాలనియు వ్యవహారము. బాల్టిక్ రాజ్యాలన్నిటిపైనను రష్యా అధిపత్యము స్థాపితమైనదేగాక, బలపరచుటగూడ అయినట్లు చూచియున్నాము. అంతేగాక రష్యాబాల్కనురాజ్యాలలో నొకటియగురుమేనియాలోని బెసరేబియానుగూడ అక్రమించుకొనుట జూలై౬వ తేదితో పరిపూర్తియయ్యెనని వింటిమి. అనాటికిబెసరేబియానుండిరుమేనియాసేనలుఖాళీ చేయుటయుపూర్తియయ్యెను.రుమేనియాకుచెందినబుకోవినాలోరష్యాసేనలు రష్యాప్రభుత్వముకోరినహద్దు దాటిపోయియుండెను. కానిఅతక్రమవరించుకొని తిరిగివెనుకకు మరలినవి.

### రుమేనియా

దీనితర్వాత రుమేనియాలలో ప్రభుత్వము కూడ మారి జర్మనీకి అనుకూలమైనప్రభుత్వము ఏర్పడెనని వింటిమి. ఈ ప్రభుత్వము జర్మనీకి అనుకూలమైనవిధానమునుకూడ ఏర్పరచుకొనెను. క్రొత్తప్రధానియగు గిగుర్తుగారు జూలై ౭వ తేది బ్రాడ్‌కాస్టులో రుమేనియాలోని రాజ్యాంగవిధానముకూడ జర్మనీనే అనుసరించగలదనిరి. ఇపుడు బ్రిటనుకు రుమేనియానుండి పోవు పెట్రోలు తగ్గించబడినది, జర్మనీకి హెచ్చించబడేటట్లున్నది. బ్రిటిషువారు రుమేనియానుండి లేచిపోవుచున్నారు.

ఇట్లుండ ఇంతలోజూలై ౫వతేదిరాత్రి మంత్రివర్గములోని ఐరన్‌గార్డు పార్టీసభ్యులు రాజీనామానిచ్చిరి. ఈపార్టీ జర్మనుల నాజీపార్టీవంటిది. దీనినణచుటకై రుమేనియారాజు కెరోలుగారు పూర్వము చాలాప్రయత్నించి, ఇపుడు దానిని తమపక్షములో కలుపుకొనిరి. కాని ఇది ఐరనుగార్డు వారికి సంతృప్తి కలిగించినట్లులేదు. ఇపుడు సంపూర్ణముగ అందరును ఐరనుగార్డుపార్టీవారలే సభ్యులుగానున్న మంత్రివర్గమువిర్పడుననుచున్నారు.

హంగరీవారు రుమేనియానుండి తమట్రాన్సిల్వేనియా కావలెనని కోరుచున్నారు. దీనిపై మరల అందోళన ఏర్పడియున్నది.

### యుగోస్లావియా, తుర్కీ

తుర్కీయొక్కయు, యుగోస్లావియాయొక్కయు విదేశాంగవిధానము ఇటలీజర్మనీ కూటముయొక్క విదేశాంగవిధానము ననుసరించవలెననియు, అట్లుగాక ఇపుడవి స్వతంత్రధోరణిలోనున్నదనియు ఇటలీవారు జర్మనీఅంగీకారముతో పైరెండుదేశముల ప్రభుత్వమువారికి హెచ్చరిక చేసినారట దీనికవసరము ఏమివచ్చెననయ్యాఅనగా,తుర్కీవారుబాకూనూనెగనులపై పాశ్చాత్యప్రభుత్వములతోచేరి ఏవో చర్యతలపెట్టియున్నారని ఇటలీకి తెలిసినదట. మధ్యధరాసముద్రములోను, అఫ్రికాలోను ఇటలీవారికి బ్రిటిషువారిచే గలిగించబడుచున్న నష్టాలనుగురించిన వార్తలను యుగోస్లావియాలోని పత్రికలు ప్రకటించుచున్నవని వాటిపై ఇటలీకసి.

రష్యా రాయబారియగు టెరన్షియోగారు మాస్కోకుపోవుచు ఇస్తాన్‌బుల్‌వద్ద జర్మనురాయబారియగు హెర్‌వాన్ పేపనుగారితో జూలై ౯వతేది సంభాషించిరి. రష్యావారి చమురుగల బాకుచమురుగనులపై తుర్కీ చర్యగైకొనతలపెట్టియున్నదని జర్మనుప్రభుత్వముగావించిన ప్రకటనను గూర్చి వీరలు సంభాషించిరట. ఇదే టోమాగా, జర్మనీ తుర్కీపై రష్యానుదూకించుటకు సాగుచునే వెదకుచున్నట్లే కనపడుచున్నది.

### రష్యా, జర్మనీల సంబంధాలు

రష్యాలోను జర్మనీలోను పూర్వము ఒకరొకరి ప్రతినిధులున్నచోట్లలో మరల ప్రతినిధులను నియోగించుటకు రెండుదేశాలవారును అంగీకరించినారు.

## జపాను

జపాను వేగముగా చైనాను. దురదృష్టవంతులగు ఫ్రెంచివారి ఇండోచైనానుకూడ కబళించుటకు పోరాడుచున్నది. జూలై ౭వ తేదినాడు చైనావారి యుద్ధకాలపు ప్రధాననగరమగు చుంకింగుపై రెండువేలబాంబులు విమానాలనుండి వర్షించినవి. జపాను సేనలు చైనానుండి తొలగించబడునంతవరకు చైనా ప్రతిఘటించుచునేయుండునని మార్షల్ చియాంగ్ కేషక్‌గారు జూలై ౬వ తేది ఒకసందేశములో ప్రకటించి, రష్యా, అమెరికాలు అలస్యము చేయక వెంటనే తమకు సహాయము పంపవలెనని కోరినారు. ఈప్రకటన చైనాలో యుద్ధము ప్రారంభమై మూడేండ్లయినందున, అసందర్భపు వార్షికస్మరణలోచేయబడినది జపానులోకూడ ఈవార్షికస్మరణోత్సవము జరిగినది. ఈసందర్భములో జపానువారు గావించిన ఒకప్రకటనలో ఈమూడేండ్ల యుద్ధఫలితాలను చెప్పుకొనినారు, ౩౯౬౬ చైనావిమానాలు క్రిందకూల్చబడిననియు, భూమిపైనున్న ౧౬౨౭ చైనావిమానాలను పాడుచేసితిమనియు, ౧౫౪౦ రష్యా విమానాలను మంచూకో సరిహద్దులలో కూల్చితిమనియు, భూమిపైనుండిన ౩౦ రష్యావిమానాలను పాడుచేసితిమనియు, చైనాకు ౩౦ లక్షల మంది సైనికులను కోల్పోయిరనియు, తమకు ౧౫౧ వేలమందిమాత్రమే పోయిరనియుప్రకటనలో చాటించుకొనినారు.

ఇపుడు దక్షిణ చైనా సముద్రములో హాంగ్‌కాంగ్, ఇండోచైనాల సమీపములో జపాను సేనలు అధికముగా చేర్చబడినవి. ౫౫ యుద్ధనావలు, ౫ క్రూయిజర్లు, ౭ సామగ్రి ఓడలు జపానునుండి ఫార్మోసాకో లేక హైనానుకో పోవుచున్నవి

చైనాలో షాంఘాయిలో ఫ్రెంచివారికిచ్చిన భాగములో ప్రసిద్ధులైన చైనావర్తకులతో సహాఅనేకులు చైనావారలను జపాను సైనికులు ఫ్రెంచిపోలీసుల తోడ్పాటుతో అరెస్టుచేసిరి.

### బ్రిటిషువారి జవాబు

బ్రిటిషువారిఅధీనంలోనిప్రదేశాలనుండి చైనావారికి యుద్ధసామగ్రి పోరాదని బ్రిటిషుప్రభుత్వమువారికి జపానుప్రభుత్వమువారుపంపిన హెచ్చరికకు బ్రిటిషువారిజవాబు జూలై౯వతేది అందజేయబడినది,

హాంగ్‌కాంగుప్రభుత్వమువారు అట్టిసామగ్రిని పోకుండనిషేధించినారనియు,ఇండియాబర్మాలనుండి సామగ్రి సాధారణవ్యాపారములోచేరినదగుటవల్ల దానినాపజాలమనియు అజవాబులోనున్నది,

ఈసమాధానము సంతృప్తికరముకాదు కనుక పునరాలోచించదగినదని జపాను విదేశాంగ మంత్రి అరిటాగారు తలచినట్లు తెలియుచున్నది.

జర్మనీపైనను, జర్మనీకిచేరిన ఇతరప్రదేశాలపైనను బ్రిటిషుబాంబులవిమానాలుఎగురుచు ఎప్పటివలెబాంబులవేయుచునేయున్నవి. జర్మను విమానాలుగూడఇట్లే బ్రిటనుపైఎగురుచు బాంబులువేయుచునేయున్నవి.

## విమానాల దాడులు ఇటలీ యుద్ధము

ఇటలీతో బ్రిటనుయుద్ధముకూడ విమానాల దాడులుతప్ప గొప్పవిశేషాలేమియులేవు. జూలై ౫వతేదినాడు ఇటలీవిమానాలు రెండవసారిగా జిబ్రాల్టరుపై బాంబులువేసెను. మాల్టాపైనను దక్షిణాఫ్రికాలోను ఇటలీవిమానాలు బాంబులు వేయుచునేయున్నవి. అఫ్రికాలో మూడాను లో భాషాలనుండి బ్రిటిషుసేనలు ఇటలీసేనలధాటికాగలేక వెనుకకు మరలవలసివచ్చెను. ఇది జూలై౪వతేదిజరిగెను,గాలాబాట్‌నుండికూడ ఇదేరోజు బ్రిటిషుసేనలిట్లే వెనుకకుమరలిపోవలసినవచ్చెను.

## ఐర్లెండు

ఐర్లెండులో డివెలరాగారిభాగము యుద్ధములో తటస్థముగానుండునని డివెలరాగారు తెలిపినారు. రెండవభాగపుప్రధాని ఇంగ్లాండుకుపోయి బ్రిటిషుమంత్రులతోమాట్లాడి జూలై౯వతేది తిరిగిచ్చిరి. ఈరెండవభాగము బ్రిటనుతోకలిసిపోరాడును.

## కాంగ్రెసు కార్యవర్గ తీర్మానము

కాంగ్రెసు కార్యవర్గమువారు ఢిల్లీలో జూలై ౩వ తేదినుండిఆలోచనలుచేసి తుదకు తీర్మానము చేసినదేమనగా, భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యమిచ్చినట్లు వెంటనే బ్రిటిషుప్రభుత్వము ప్రకటించవలెను. మరియు ఇపుడుదానికనుగుణముగా కేంద్రశాసనసభలో ఎన్నుకోబడియున్న సభ్యులందరివిశ్వాసమున కర్హులైనసభ్యులంగలిగి, రాష్ట్రీలలో బాధ్యతగల మంత్రులసహాకారము సాధించగల జాతీయప్రభుత్వమును కేంద్రమున ఏర్పరచవలెను. లేనిచో భారతదేశరక్షణకు చేయబడేయత్నాలలో ప్రయోజనవంతముగా కాంగ్రెసుపాల్గొనజాలదు.




Printed and Published by. G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A. B. L.